దగ్గర నుంచుంది. చిలకావు ఎక్కడలేని ప్రేమతో రెండు దూడలనూ నాకింది. గోరింక దూడ మీద చిలకావు చూపిస్తున్న ప్రేమను చూచి సీతమ్మ ఆశ్చర్యపోయింది. జగన్నాథం చనిపోయిన గోరింకనూ, తన భార్యనూ జ్ఞాపకం చేసుకుంటున్నాడు. గోరింక దూడ చిలకావు పొదుగు దగ్గర ముట్టెపెట్టి పాలు కుడువబోయింది. చిలక ఊరుకుంది. గోరింక దూడనుచూసి చిలక దూడ కూడా మరొకరు చెప్పకుండానే తల్లిపాలు తాగడం నేర్చుకున్నది. రెండుదూడలూ స్వేచ్ఛగా తల్లిపాలు తాగుతున్నాయి.

జగన్నాథం ఆ దృశ్యాన్ని తన్మయుడై చూస్తున్నాడు. అతని మనస్సులో అనేక భావాలు పరుగెత్తాయి. తన బిడ్డనుగూడా ఎవరో వత్సానికి అదుముకుని పాలు ఇస్తున్నట్లు తోచింది. కొడుకు ఏడుపు వినబడకపోవడం చూసి వెనక్కి తిరిగాడు. అతనికి కనబడిన దృశ్యం అతన్ని ఒక క్షణం నిశ్చేష్టుణ్ని చేసింది. ఆనందమో, గౌరవమో, కృతజ్ఞతో ఏమిటో అతన్ని స్వర్గవీథుల్లోకి ఎత్తుకుపోయింది. ఆ తన్మయత్వంలో అతడు అకస్మాత్తుగా చేతులు జోడించి 'సీతమ్మ తల్లీ ! నువ్వు నా బిడ్డకే కాదు. నాకు గూడా తల్లివి' అని నేల మీద పడి నమస్కారం చేశాడు.

[భారతి - తారణ - భాద్రపదము.]



# కల్యాణి

తరిమి తరిమి కాస్తున్నాయి ఎండలు. బంగళాచుట్టూ ఉన్న మామిడి తోటా, గుమ్మాలకు కట్టిన వట్టివేళ్ళ తడి కలూ వాటి నడ్డగించడంలో ఎందుకూ పనికిరావడం లేదు.

ఉక్క పోసి పోసి నీరసించి నట్టయి కల్యాణి కప్పుడే నిద్ర పట్టింది. ఆమె అలా రెప్ప వాల్చిందో లేదో అంత లోనే ఒక్క కందిరీగ గదిలో దూరి ఆమె ముఖం మీదే రొద చెయ్య సాగింది.

చర్రున లేచింది కల్యాణి, దాన్ని నలిపి పారెయ్యా లన్నంత కోపంతో. కాని ఎంత ప్రయత్నించినా అది అందక పోగా 'ఏం చేస్తావో చెయ్యి చూద్దాం' అంటున్నట్లు ఉండుండి మీదికి వచ్చి చటుక్కున పారిపోతూ ఆమెను మరింత కవ్వించింది.

కోపం, చేతకానితనం, చిరాకూ ఆమెను ముంచేస్తు న్నాయి. అయినా ఆ కందిరీగ గదిని విడిచిపెట్టడం లేదు. చూచి చూచి కల్యాణి పక్కనున్న పుస్తకం తీసుకుని దూసుకు వచ్చినదాని మీదికి విసిరి కొట్టింది. అది పుస్తకం తో పాటు గోడకు తగిలి రెపరెపా కొట్టుకుంటూ కింద పడి పోయింది.

ఒక్కసారి నిట్టూర్పు విడుస్తూ అమ్మయ్యా అనుకు న్నది కల్యాణి.

ఇక నిద్ర ఎలాగూ పట్టదని ఆ పుస్తకం తెచ్చి నలిగిన కాగితాలు సరిచేస్తూ పడక కుర్చీలో నడుం వాల్చింది. ఎదురుగా చచ్చి పడిపోయిన కందిరీగ కనిపిస్తోంది. ఆమెకు చదవ బుద్ధి వెయ్యలేదు. లేచి వెళ్ళి చీపురు పుల్ల మడిచి దాన్ని పట్టుకుని అవతల పారెయ్యాలని కిటికీ రెక్క తీసింది. నిప్పులు చెరిగినట్టు వడగాలి ముఖానికి కొట్టుకుంది. 'అబ్బా' అనుకుంటూ దాన్ని పారేసి దబాలున రెక్క వేసేసింది కల్యాణి.

బైట ఎంత వెలుగుందో లోపలంత చీకటిగా ఉంది. అంచేతే ఆమె కళ్ళు రెక్క తెరిచినంత మాత్రానికే మసకలు కమ్మాయి. కాసేపు నిలబడి పమిట కొంగుతో కళ్ళు తుడుచుకుని, లోపలికి పోవాలని ఆమె తల ఎత్తింది - ఎదురుగా హాలు గుమ్మంలో నుంచుని ఆమె వంకే చూస్తూ చిరునవ్వు నవ్వుతున్న మోహనరావు కనిపించాడు - వచ్చి ఎంత సేపయిందో ఏమో అతని కళ్ళల్లో గాని ముఖంలో గాని ఎండలో నుంచి అప్పుడే నీడలోకి వచ్చిన సూచన లేమీ కనిపించడం లేదు.

కల్యాణి ఆశ్చర్యం వేసింది. వెంటనే సంభ్రమంతో 'రండి. రండి! ఏమి టీ రాక?' అంటూ స్వాగత సమర్పణతో సౌహార్ద్రాన్ని వెలిబుచ్చింది.

ఆమె తన ఉనికి నింత త్వరగా గుర్తిస్తుందని అతననుకోలేదు కాబోలు, ఒక్కసారి చకితుడై, వెంటనే సర్దు

కొని, ముందడుగు వేస్తూ 'అంత ఆశ్చర్య పడతారేం! రాగూడదా ఏమిటి?' అన్నాడు నవ్వుతూ.

'అదా నా ఉద్దేశ్యం! ఇంత అకస్మాత్తుగా ఈ వేళప్పుడు ఈ రావడ మేమిటని గాని రా గూడదని ఎవ రంటారు! అందులో ప్రభువుల్ని గూర్చి మాబోటివాళ్ళు అంతమాట అనగలగడమే? '

'ఎవరయితేనేం! అవసరమైనప్పుడు ఏ వేళ అయినా రాక తప్పదు గదా!'

'అలా చెప్పండి సంగతి! ఏ అవసరమూ లేకపోతే మహానుభావులకు మే మసలు కనిపిస్తామా?'

'ఎవరు మహానుభావు లయిందీ, ఎవరి కెవరు కనిపించడం లేందీ తెలుస్తూనే ఉందిగా!'

'అలాగా! మెల్లిగా వచ్చి చీకట్లో మూల నుంచోవడం మీ పొరపాటుగాని నేను చూడకపోవడం కాదు. ఏమంటారు? నిజం చెప్పండి.'

కల్యాణి చమత్కారానికే అన్నా ఇది కొంచెం ఘాటనిపించి మోహనరావు కళవళ పడ్డాడు. అది గుర్తించి, అత నింకా తేరుకోక ముందే కల్యాణి, 'నా తెలివి తేటలు బాగానే ఉన్నాయి. పెద్దలు వస్తే కూర్చోమనైనా అనకుండా నుంచోబెట్టే మాట్లాడుతున్నాను. అల్లా సోఫాలో కూర్చుని తాపీగా ఆలోచించి చెప్పండి నే వెళ్ళి కూజాలో మంచి నీళ్ళు తెస్తాను.' అని నవ్వుతూ అంటూ లోపలికి వెళ్ళింది.

మోహనరావు ఆమె వంకే చూస్తూ సోఫాలో కూర్చున్నాడు. ఎన్నిసార్లు చూచినా అతని కళ్ళకు కల్యాణి ఎప్పుడూ కొత్తగానే కనిపిస్తూ ఉంటుంది. ఆ శక్తి ఆమె సౌందర్యంలోనే ఉందో లేక అతని కళ్ళల్లోనే ఉందో తెలియదుగాని ఒకటి మాత్రం నిజం. సౌందర్య మెప్పుడూ వస్తువులో నే ఉండదు, చూచేవారి కళ్ళల్లో గూడా ఉంటుంది. అందువల్లనే గ్రీష్మతాపానికి నిద్ర పట్టక వాడి పోయిన ముఖంతో, చెదరిన ముంగురులతో, నలిగిన దుస్తులతో, కళ్ళు నులుముకుంటూ ఆ పూట ప్రత్యక్ష మయిన కల్యాణి అతని కెంతో విలాసవతిగా కనిపించింది. అంతే కాదు. అతని దృష్టి అలాంటిది కాబట్టే ఇప్పు డామె ఎత్తి పొడిచి వెళ్ళి పోతున్నప్పటికీ ఆత్మాభిమానం వ్యక్తం కాక ఆమె నడకలోని ఒయ్యారాన్ని చూచే అతని మనసు పరవశ మైంది.

ఏ మాలోచిస్తున్నాడో ఏమో కూజాతో కల్యాణి వచ్చేటప్పటికి మోహనరావు ఉలిక్కి పడ్డాడు.

ఆమె చిరునవ్వు నవ్వుతూ కూజా బల్లమీద పెట్టి చల్లగా ఉన్నాయి, కాసిని తీసుకోండి 'అంటూ గ్లాసులో పోసి ఇచ్చింది. మంచి ఎండలో వచ్చాడామె అతను మరో గ్లాసు గూడా పోయించుకుని ఆప్యాయంగా పుచ్చుకున్నాడు.

కల్యాణి తానూ కాసిని తీసుకుని కుర్చీలో కూర్చుంటూ ఇప్పుడు చెప్పండి వచ్చిన ప నేమిటో ' అన్నది.

మోహనరావు కేం చెప్పాలో తోచలేదు. కాని అతని నోట్లోనుంచి అప్రయత్నంగా 'ఇవ్వాళ మీరు మాతో రావాలి' అని వచ్చేసింది.

ఆతనితో అంత చనువుగా ఉంటున్న కల్యాణిగూడా ఈ మాట విని అప్రతిభురా లయింది. అతని ఉద్దేశ మేమిటో ఆమెకు బోధపడలేదు.

కాని అంతలోనే అతను తన తొందరపాటు తెలుసుకుని 'లలిత' అంటూ ఏమో చెప్పబోయాడు.

చటుక్కున కల్యాణి ఆదుర్దాతో 'దివాణానికి నన్ను తీసుకు రమ్మన్నదా ఏం?' అని అడిగింది.

'కాదు, కాదు. సింగారం తోటకు పోదామని బుద్ధి పుట్టింది. మీరుగూడా వస్తే బాగుంటుందని.'

'సరే! మనం దివాణానికి వెళ్ళా లన్న మాటేగా!'

'అక్కర్లేదు. అనవసరంగా చుట్టుగదూ! మన మిటు జగ్గులపల్లి మీదుగా వెళ్ళేసరికి ఆవిడ అటు సరాసరి వచ్చేస్తుంది.'

'బాగానే ఉంది. దీనికోసం ఇంత ఎండలో మిమ్మల్ని పంపించిందా? కబురు చెప్పి బండి పంపిస్తే చాలదూ?'

నిజాని కంత మాత్రమే చాలు. వాళ్ళకూ, వాళ్ళకూ ఉన్న సన్నిహితత్వం అల్లాంటిది. కాని మోహనరావు కొంచెం ఆలోచించి 'సరాసరి దివాణానికి కాదుగా! అంచేత నన్నే వెళ్ళమన్నది.' అన్నాడు.

'కాకపోతే మాత్రం నేను నమ్మనా ఏమిటి ?'

అత నెందుకో ఒక మాటు చకితు డయ్యాడు. కాని కల్యాణికి తెలియగూడదని బుజం మీద ఏదో పడ్డట్టు దులుపు కుంటూ 'నమ్మ రనా ! పదిమైళ్లు ఒంటరిగా వెళ్లాలిగదా, అయిన వాళ్ళు వెంబడి ఉంటే మంచి దని నన్ను పంపింది' అన్నాడు జాగ్రత్తగా.

'సరే గాని మీ స్నేహితులు నాలుగు గంటలకల్లా వస్తా మన్నారు. అందాకా ఉండి తర్వాత వెళ్దాం.'

'అన్నట్టు ఆ సంగతి చెప్పడమే మరిచి పోయాను. ఇవ్వాళ లేదో అర్జెంటుపని వస్తే సూర్యం కారు తీసుకుని బెజవాడ వెళ్ళాడు. మళ్ళీ పదిహేను రోజుల వరకూ రాడు.'

'ఆఁ ! పొద్దున్న వెళ్లేటప్పు డేమీ అన లేదే !'

'అప్పటికి అతనికి మాత్రం ఏం తెలుసు ! ఇలా పని తగుల్తుందని కలగన్నామా ఏమిటి ?'

'ఏం పనులో ఏమోగాని ఈయన ఎప్పుడూ ఇంతే ! ఎంత అర్జెం టయితే మాత్రం ఒక మాటు ఇలా ఇంటికి వచ్చి పోగూడదూ ?'

'వీలు కాందే అత నేం చేస్తాడు పాపం'

'వెళ్లేది కారు మీ దయినప్పుడు ఆ మాత్రం వీలు కాదా ఏమిటి, ఇంటి దగ్గర వాళ్లు ఎలా ఉంటారో అన్న ఆలోచన లేక గాని.'

'ఉన్నా సాగ వద్దూ ?'

'మనసుంటే మహా చక్కగా సాగుతుంది. స్నేహితులు గదా అని ఊరికే సమర్థించ బోకండి.'

మోహనరావు మాటాడలేదు. నిజాని కతను సూర్యాన్ని సమర్థించడం లేదు. తన్ను తానే సమర్థించుకుంటున్నాడు.

ఆ సమయంలో వంట మనిషి సుబ్బమ్మ వచ్చినట్టు లోపల అలికి డయింది. దాంతో కల్యాణి 'సరే కాని మీ కేం కావాలి కాఫీయా, షర్బత్తా?' అన్నది ఆతిథ్యం మాట జ్ఞాపకం వచ్చి.

'మీ రేం తీసుకుంటే అదే! అడిగి కూడా ఆతిథ్య మిస్తారా ఏమిటి మీ యింట్లో?'

'ఏదో చేత నయినంత వఱకూ, ఎంతయినా మేం జమీందార్లం కాదుగదా!' అంటూ అత నొక మాటు చురుక్కున చూసి ఆమె లోపలికి వెళ్ళింది.

ఆ చూపును మోహనరావు పరమ లుబ్ధతతో హృదయంలో దాచుకున్నాడు.

కాని కల్యాణి అతని కేమీ అర్థం కావడం లేదు. నిజాని కతనిలో ఆ ప్రయత్నం గూడా లేదు. అయినా అతని మనస్సు స్వార్థంతో సమస్తమూ తన కనుకూలంగానే భావించుకుంటోంది.

అతని చెల్లెలు లలిత కంటే గూడా కల్యాణే అతనితో ఎక్కువ చనువుగా ఉంటుంది. దీనికి సూర్యమూ

అతనూ చిన్నప్పటినుంచీ కలిసి చదువుకుని అన్నదమ్ముల కంటే ఎక్కువ అన్యోన్యంగా ఉంటూ ఉండడమే అసలు హేతువు. అదీకాక సూర్యం ప్రాక్టీసు మానేసి తన తండ్రి చేసిన ఉద్యోగం అన్న గౌరవంతో వీళ్లదగ్గర దివానుగా చేరిన ఈ ఆరేళ్లబట్టీ లలిత కూడా ఆమెకు స్నేహితురా లయింది. పైగా ఆమె పెద్ద చదువు చదువుకోకపోయినా చక్కని సంస్కారంగల యువతి. అంచేత మోహనరా వామెకు బంధు కోటిలో వాడిలాగానే కనిపిస్తాడు. కాని భర్త స్నేహితుడూ, స్నేహితురాలి అన్నా అయినంత మాత్రాన పరపురుషునితో ఇంత చనువుగా ఉండే స్త్రీ అతని అనుభవంలో ఆమె ఒక్కతే!

కల్యాణి వచ్చి 'ఇదిగో, మీకు కాఫీ తెచ్చాను. నాకు షర్బతు తెచ్చుకున్నాను.' అంటూ కుర్చీలో కూర్చుంది.

'అల్లా చేశారేం? మీ రేది తీసుకుంటే అదే నాకు కూడా తెమ్మన్నానుగా!'

'ఏమో! మీరు స్పష్టంగా చెప్పలేదు. అంచేత నాకు తోచినట్టు చేశాను. కావాలంటే ఇదీ ఇస్తాలెండి. ముందది పుచ్చుకోండి.'

'అబ్బెబ్బె! అందుకు కాదు. నాకసలు కాఫీయే ఇష్టం!'

'ఆ సంగతి తెలిసే నే నది తెచ్చాను. మరి ఊరికే పోట్లాటకోసం పేచీగులాడతా రెందుకు ?'

ఈ ప్రశ్న అతని జమీందారు మనస్సుకు కొంచెం కష్టం కలిగించినా తన కిష్టమయిందేదో ఆమెకు తెలుసునన్నందు వల్ల అతనికి సంతోషమయింది.

వేడి వేడి కాఫీ నెమ్మదిగా పుచ్చుకుంటూ, కల్యాణి ఖాళీగ్లాసు బల్లమీద పెట్టడం చూచి 'అప్పుడే అయిపోయిందే మీది!' అన్నాడు మోహనరావు.

' అది వేడిదాయ్- ఇది చల్లటిదాయ్ !'

అతని మన స్సెందుకో కలుక్కు మన్నది. ఆ మాటలో తా మిద్దరూ పరస్పర వ్యతిరేకు లన్నభావం తోచింది కాబోలు. కాని అదేమీ సూచించకుండా 'అయితే మీరు వెళ్లి సిద్ధం కారాదూ? మనకు వేళ కూడా మించి పోతుంది' అన్నాడు బతిమాలుతున్నట్టు.

'ఏం మించి పోతోంది. మూడుంబావేగా అయింది.'

'ప్రయాణ మవుతున్నది ఆడవాళ్లా, మరెవరన్నానా?'

'అయితే చూడండి. ఎంతలో వస్తానో' అంటూ ఆమె లోపలికి వెళ్లింది.

మోహనరావు కాఫీగ్లాసు బల్లమీద పెట్టి సోఫాలో నడుం వాల్చాడు. అక్కడ నుంచి చూస్తుంటే గదిలో అద్దమూ, దాని పక్కన పుస్తకాల బీరువా, గోడకున్న సూర్యం ఫోటో అన్నీ కనిపిస్తున్నాయి. ఆ ఫోటో చూసి సూర్యం నిజంగా అదృష్టవంతు డనుకున్నాడు మోహన

రావు. కాకపోతే అంత చదువూ, ఇంత ఉద్యోగమూ, వీటికి తోడు ఈ కల్యాణీ - ఇన్నీ ఒక్కసారి కూడి రావడం ఎల్లా సంభవిస్తుంది! నిజంగా కల్యాణి ఎవరైనా గర్వించ దగిన స్త్రీ. ఆమె సాహచర్యం లభించిన జన్మే జన్మ!

అంతలోనే ఆమె స్నానం చేసి, మంచి బట్టలు కట్టుకుని జడ వేసుకోవాలని అద్దం దగ్గరకు వచ్చింది. అదృష్ట వశాత్తు ఆ అద్దంలో మోహనరావు కనిపించడం లేదు. అంచేత ఆమె గదిగుమ్మాని కున్న తెర వేసి లేదన్న ఊహే లేక, జడ అంతా ఊడదీసి మామూలుగా దువ్వుకుంటోంది. మోహనరావు తన్మయత్వంలో అటువైపే చూస్తున్నాడు. పాపిడి తీసుకుని ఆమె తన శిరోజాలను మెత్తగా దువ్వుకొన్నది. నల్లగా నిగనిగలాడుతూ ఒత్తుగా పొడుగ్గా ఎదిగిన ఆ కేశ సంపదను చూచి అతను మేఘాన్ని చూచిన మయూరమే అయ్యాడు. ఆమె తల ఓరగా వంచి పాయలు పాయలుగా తీసి దువ్వుతూ జడ అల్లుకుంటోంది. ఆ అల్లిక అతని హృదయాన్నే ఉద్రేకంతో పెనవేస్తోంది. కొనతేలిన ఆమె వాలుజడ జఘనసీమను దాటి తోకమీద నిలుచున్న నల్ల త్రాచులా అతని మనస్సు నాకట్టింది. అప్పటికిగాని అతని దృష్టి ఆమె కట్టిన చీరమీద పడలేదు. ఆ పట్టుచీర చిక్కని పచ్చని వరిచేను రంగులో ఉంది. దానిమీద జరీపూవులు మధ్యమధ్య పూసిన కాజపూవుల్లా నిగనిగలాడుతున్నాయి. ఈ లోగా తోటలో పూసిన బొండు మల్లి మొగ్గలు దండ

కట్టి అప్పుడే పనిమనిషి తెచ్చి యిచ్చింది కాబోలు ఆమె దాన్ని తలలో చెరివికొన్నది. అప్పుడామె జడ నీరెండ కాస్తుంటే నల్లత్రాచు శాద్వలంలో పడుకుని మిలమిలా మెరుస్తున్న పడగెత్తి ఎరకోసం చూస్తున్నట్టుంది. కస్తూరి కలిపిన కుంకుమ తీసి చూపుడు వేలితో ఆమె తన ముఖాన తిలకం దిద్దుకున్నది. అది తన గుండెలో మారబాణం దూసి చన్నట్టయి అత నానందం పట్టలేక సోఫాలోనే లేచి కూర్చున్నాడు. అప్పటికీ అతని అదృష్టం బాగుండబట్టి అద్దంలో ఆమెకి కనిపించలేదు. ఆమె చెదరిన ముంగురులు సరిచేసుకుంటూ కనురెప్ప లాడిస్తూ ఉంటే ఇక్కడ మోహనరావు హృదయమే స్పందింప సాగింది.

అలంకారం పూర్తయి ఆమె హాలువైపు తిరిగింది. అద్దంలో ప్రతిబింబిస్తున్న మల్లెచెండుతో ఆమె మూర్తి సర్వోత్తమ కిరీటం దాల్చిన సౌందర్య దేవతలా ఉన్నది.

మోహనరావు అంత తన్మయత్వంతో చూస్తున్నా అసలు వచ్చిన పని మరిచిపోలేదు.

ఆమె మరి రెండడుగులు వేసి గుమ్మం దగ్గరకు వచ్చింది. అంతవరకూ ఎటో చూచి అప్పుడే ఆమెను చూస్తున్నట్టు మోహనరావు అటువైపు ముఖం తిప్పాడు.

కల్యాణి చిరునవ్వు నవ్వుతూ 'అల్లా చూస్తారేం? ఎంతయిం దేమిటి?' అన్నది.

'అదే! ఇంత త్వరగా ఎల్లా సిద్ధ మయ్యారా అని ఆశ్చర్యపడుతున్నాను.' అన్నాడు మోహనరావు ప్రయత్నించి ముఖంలో ఆ భావాన్నే సూచిస్తూ.

ఆమె హాల్లోకి వచ్చి గడియారం చూచింది.

'ఇరవై నిమిషాలే అయింది. ఇక నా దేం ఆలస్యం లేదు.'

'నాదిమాత్రం ఏ ముంది? బండీ సిద్ధంగానే ఉంది.' అంటూ మోహనరావు లేచి పోర్టికోలోకి వెళ్ళాడు.

తాను జమిందారుగారి తోటకు వెళ్తున్నా ననీ, ఇల్లు జాగ్రత్తగా చూస్తూ ఉండ మనీ, వంటమనిషితోనూ, పని మనిషితోనూ చెప్పి కల్యాణికూడా వాకిట్లోకి వెళ్ళింది.

ఎండ ఇంకా తీవ్రంగానే ఉంది. అంతకు ముందే చన్నీళ్లు స్నానం చేసినందువల్ల పోర్టికోలోకి వచ్చినంత మాత్రానికే ఆమె ముఖంనిండా చెమటలు పోశాయి. అయినా స్టార్టుబండి తెల్లగుర్రాలకు కళ్లాలు తగిలిస్తూ ఆమె వంక చూచిన మోహనరావుకు అవి ముత్యాల పంటలా కనిపించాయి.

రుమాలుతో ముఖం తుడుచుకుంటూ 'ఇస్మాయిల్ ఏడీ?' అన్నది కల్యాణి.

'వా డెందుకూ? లేను తోల్తాగా!' అన్నాడు మోహనరావు ముందుకువచ్చి బండి తలుపు తెరిచి పట్టుకుంటూ.

'ఇది గూడా లలిత పురమాయింపేనా ఏమిటి?' అని నవ్వుతూ కల్యాణి మెట్లు దిగి బండి దగ్గరకు వెళ్ళింది.

ఎక్కబోతూ చీరకుచ్చిళ్ళు సర్దుకోవాలని ఆమె తల వంచింది. సరిగా ఆమె కాళ్ళదగ్గర మధ్యాహ్నం పారేసిన కందిరీగ పడి ఉంది. ఆమె మనస్సు చివుక్కుమన్నది.

కల్యాణి ఏమాలోచిస్తోందో తెలియక ఆదుర్దా పడుతున్న మోహనరావు 'ఎక్కరేం? ఏమిటి చూస్తారు?' అన్నాడు. ఆమె 'ఏం లేదు, ఏం లేదు' అంటూ కంగారుగా బండి ఎక్కబోయింది. అతను తెరిచి పట్టిన బండి తలుపు గుండీకి పమిటకొంగు పట్టుకుని ఆమెను వెనక్కు లాగింది. ఇదేమిటా అని వెనుదిరిగి చూస్తున్న ఆమె వంక చూచి చిరునవ్వు నవ్వుతూ అతను దాన్ని తప్పించి తలుపు వేశాడు. ఆమె అమాయికంగా చిరునవ్వుతో తన కృతజ్ఞత ప్రకటించింది.

ఇప్పటి వరకూ మోహనరావు క్షణక్షణానికీ తన ప్రయత్నం ఫలిస్తుందో ఫలించదో అని భయపడుతూనే ఉన్నాడు. ఆమె బండిలో కూర్చోవడంతో ఆ భయం మూడు వంతులు పోయింది. ఇంత మాత్రానికే పరమ సంతోషం పొంది ముందుకు వెళ్తున్న అతని కాలికింద పడి ఆ కందిరీగ మరీ నలిగింది. కాని ధరించిన బూట్లవల్ల స్పర్శ జ్ఞానం కోలుపోయిన అతని కాళ్ళు దాన్ని గమనించనే లేదు.

మోహనరావు ముందు కూర్చున్నాడు. కల్యాణి లోపల కూర్చుంది.

పనిమనిషి వచ్చి బండి కిటికీల కున్న వట్టివేళ్ళ తడికల మీద నీళ్ళుపోసింది. దార్లో చల్లుకోవడానికికని ఒక బక్కెటు నీళ్ళు లోపల పెట్టింది.

కల్యాణి మళ్ళీ ఇంటి విషయమై ఆమెను హెచ్చరిస్తుండగా బండి బయలుదేరింది. ఆమె ఒళ్ళెందుకో ఒక్కసారి జల్లు మన్నది.

ఆ బండిమీద ఒంటరిగా ప్రయాణం చెయ్యడం ఆమెకు కొత్త కాదు. జమీందారుగారింట్లో ఏ అవసరం వచ్చినా వాళ్ళు బండి పంపుతూ ఉండడం, ఈమె వెళ్తూ ఉండడం పరిపాటే. కాని ఇదివరలో జమీందారు కొడుకే స్వయంగా ఆమె కూర్చున్న బండి తోలలేదు. ఆమె మనస్సు వీళ్ళ కుటుంబం తమ యెడల చూపుతున్న గౌరవాభిమానాలకే పరవశమైపోతోంది.

బంగళా ఆవరణ దాటి రోడ్డుమీదికి వచ్చింది బండి. అట్టే జనసంచారం ఉండే ప్రదేశంకూడా కాదు. అయినా ఎందుకనో అతను నెమ్మదిగానే తోలుతున్నాడు, మాటిమాటికీ వెనక్కిచూస్తూ. పరస్పర సంబంధం ఉందోలేదో గాని అక్కడక్కడ బాటసారులు కనపడడం అతను చూడడం ఒక్కమాటే జరుగుతున్నాయి. ఇదంతా తన క్షేమంకోసం అతను పడుతున్న జాగ్రత్తగానే భావిస్తోంది కల్యాణి.

కొంతదూరం పోయాక అత నలా వెనక్కి తిరిగి నప్పుడు 'ఇంత నెమ్మదిగా తోల్తున్నారేం ?' అన్న దామె చిరునవ్వు నవ్వుతూ.

ఆ నవ్వుకు లోపల సంతోషిస్తూ 'వేగంగా తోలితే వడగాలి తాకుతుంది. అందుకోసం సందేహిస్తున్నాను.' అన్నాడు మోహనరావు కాస్త ఆలోచించి.

'అయినా ఇంతసేపు ఎండలో ఉండడంకంటే త్వరగా వెళ్లడం నయం కదూ !'

'నిజమే కాని ఈ రెండు మైళ్ళ వరకే ఈ ఇబ్బంది. తర్వాత రోడ్డువెంబడి చెట్లుంటాయి. అక్కడనుంచి పావు గంటలో వెళ్ళిపోవచ్చు.'

అత నన్న మాట నిజమే. చింతతోపు దగ్గర నుంచీ రోడ్డుకు రెండుపక్కలా ఒత్తుగా చెట్లున్నాయి. ఎంత ఎండా కాలమైనా అక్కడ ప్రయాణం చెయ్యడం హాయిగా ఉంటుంది.

అంతలో పెద్దమ్మగారి తోట వచ్చింది. అది ఆ ఊళ్లో కల్లా పెద్ద పేరు పొందిన తోట. కొన్నివిధాల చూస్తే ముది తోటన్న మాటే గాని సింగారం తోటకంటే ఇదే బాగుం టుంది. లలిత పీళ్ళింటికి వచ్చినప్పుడల్లా కల్యాణీ, ఆమే కలిసి ఈ తోటలోకి పోయి చాలాసేపు గడుపుతూ ఉండే వారు. ఇందులో ఒక పెద్ద దిగుడుబావి ఉంది. కల్యాణికీ పూరు రాకముందు ఈత రాదు. లలితే ధైర్యం చెప్పి

స్వయంగా తోడు వుండి ఆమె కీత నేర్పించింది. నేర్చుకునే రోజుల్లో ఒకసారి కల్యాణి చీర బిగగట్టి ఒడ్డునే మెల్లగా ఈదుతోంది. అప్పటి కామెకు నీళ్ళమీద తేలడం చేత నయింది. అంచేత కొంచెం ధైర్యంచేసి రెండడుగులు లోప లికి వెళ్ళింది. అంతలోనే దురదృష్టవశాత్తు బిగించిన చీర వదులయి కాళ్ళ కడ్డం పడింది. ఆపూట లలితే గనక వెంటనే పట్టుకుని ఒడ్డుకు లాగకపోతే కల్యాణి పని అయిపోయేదే! ఈ తోట వెంబడి పోతుంటే ఆమె కిలాంటి వెన్నెన్నో జ్ఞాపకం వచ్చాయి.

తోట వెళ్లిపోయి తుమ్మల గుమ్మ వచ్చింది. మోహనరా వింకా నెమ్మదిగానే తోలుతున్నాడు. అప్పుడప్పుడు వెనక్కి తిరిగి చూస్తున్నాడు కూడా. కాని కల్యాణి అతని వైపు చూడడం లేదు.

లలిత చాలా సరదా మనిషి. జమీందార్ల బిడ్డ అయినా ఆమెలో ఆ భావం ఏ కోశానా లేదు. తమ కొలువులో ఉంటున్న దివాను భార్య అని చులకన చెయ్య కుండా తనంతట తానే వాళ్లింటికి ఎన్ని సార్లు వచ్చిందీ! రావడమే కాదు వచ్చినప్పు డల్లా గంటల కొద్దీ వుండి తోడ బుట్టిన దాని లాగానే చనువుగా మసులుకునేది. ఇద్దరూ ఊళ్లో ఉంటే రెండు రోజుల కొక్కసారైనా కలుసుకో వలసిందే! అంత కంటే ఆలస్య మయితే ఎన్నాళ్లో అయిన ట్టుంటుంది.

ఎడ్లబీడు దాటి పోతోంది. చింతతోపు కనిపిస్తోంది.

లలిత ఈ పాటికి సింగారం తోటకు వెళ్లే ఉంటుంది. ఆ తోటంటే ఎందుకో ఆమెకు చాలా ఇష్టం. ఆ లేదోటలో సాయంకాలపు వేళ ఒక్కమాటు తిరిగితే ఆమె కేమిటి ఎవరికైనా అలాంటి ఇష్టమే ఏర్పడుతుంది. అందులో ఆమె చిన్నప్పటి నుంచీ ఈ వాతావరణానికి అలవాటు పడ్డదామె. ఆరునెలలు అత్తవారింట్లో ఉండి వచ్చేసరికి పీటి కన్నిటికీ మొహం వాచిన ట్లయిపోయింది. వచ్చి వారం రోజు లయిందో లేదో మొన్న పీళ్లింటికి వచ్చినప్పుడే పోదాం రమ్మన్నది కల్యాణిని. కాని ఆ నాడు సూర్యానికి కొంచెం సుస్తీగా ఉండడం వల్ల మరోమాటు పోదా మనుకున్నారు ఇద్దరూనూ. ఇవ్వాళ ఆమెకు సరదా పుట్టింది కాబోలు మోహనరావును పంపించింది.

ఎక్కడ నుంచో గుప్పున సారావాసన కొట్టింది. కల్యాణి చటుక్కున ముందువైపు చూచింది. మోహనరా వప్పుడే తొడమీద వేసుకుని ఉన్న పగ్గాలు పట్టుకుంటు న్నాడు. అటూ ఇటూ చూస్తే దారి పక్కన కొన్ని తాటి చెట్లకు కుండలు కనిపించాయి. లోపల బక్కెట్లో ఉన్న నీళ్లు తీసి లోటాతో తడికల మీద పోసింది కల్యాణి. కమ్మగా వట్టి వేళ్ల వాసన తగలసాగింది.

అంతలో మోహనరావు బండి వేగం హెచ్చించాడు. ఆమెను మౌనంగా ఉంచడం ఇష్టంలేక ఇందాకటి నుంచీ

మాట్లాడాలని ఉన్నా అతని కెందుకో చేతకావడం లేదు. చింతతోపు దాటాక అతనికి కొంత ఉత్సాహం వచ్చింది.

'ఏం మాట్లాడకుండా కూర్చున్నారేం!'

'నా కేమున్నాయి సంగతులు. చెప్పవలసిన వారు మీా రూరుకుంటే నే నేం చెయ్యను!'

'లలిత ఈ పాటి కక్కడకు వెళ్లి ఉంటుంది.'

'అదే నేనూ అనుకుంటున్నాను.'

'వస్తే అమ్మగారు కూడ వస్తా రేమో!'

'మరా మాట ఇందాక చెప్పలే దేం!'

'అనుమానంగా అన్నారు గదా అని ఊరుకున్నాను.'

ఇంకా ఎక్కడ నుంచో గుప్పు గుప్పున ఇందాకటి వాసన తగులుతూనే ఉంది. కాని బండి వేగంగా పోతూ ఉండడం వల్ల అట్టే తెలియడం లేదు. కల్యాణి సమన్వ యించుకో లేక పోయింది. ఇది వట్టి కల్లు వాసన కాదు. ఏదో సువాసన. అయినా మాదకద్రవ్యం బాపతే! ఎక్కడి నుంచి వస్తోం దిది! తడిసిన తడికలలో నుంచి లోపలికి చల్లని గాలి వస్తోంది. ఆ చల్లదనం ఆమె మనస్సు నుత్తేజ పరుస్తోంది. మళ్లీ మళ్లీ తడికల మీాద నీళ్లు పోస్తూ ఆమె మాట్లాడ లేదు.

సూర్యానికికూడా సింగారం తో టంటే చాలా ఇష్టం. కిందటేడు వేసవికాలంలో లలితా, కల్యాణీ, సూర్యం ముగ్గురూ వెళ్లా రక్కడికి. అప్పుడు మోహనరావు ఊళ్లో లేడు. అంచేత అతను రాలేదు. సాయంకాలపు వేళ ఒక

చోట కూర్చుని వీళ్లు ముగ్గురూ కబుర్లాడుకుంటున్నారు. ఆ పక్కన కొంత బయలు ప్రదేశ ముంది. చటుక్కున లలిత కల్యాణి నోరు మూసి భయ పడ వద్దని కళ్లతో సంకేతం చేస్తూ అటు వైపు ముఖం తిప్పింది. అక్కడొక పెద్ద త్రాచు పాము కంచెలో నుంచి దూసుకువస్తున్న గాలి కోసం పడగెత్తి ఎదురు పోతోంది. ఆ పాము ఎంత భయంకరంగా ఉందో అంత మనోహరంగా ఉంది. 'సూర్యం దాని వంకే తన్మయత్వం తో చూస్తున్నాడు. అలా నాలుగు నిమిషాలు నిశ్శబ్దంగా ఉండే సరికి దాని దారి నదే పోయింది. కల్యాణి అంతకు ముం దెప్పుడూ అలాంటి పామును చూడలేదు. అప్పుడు భయం వేసింది గాని తర్వాత తర్వాత చాలా చూస్తూ ఉండడం వల్ల ఇప్పుడా భయా లన్నీ పోయాయి. కాని ఆ తోటకు సంబంధించిన మధురస్మృతు లనేకం ఉండగా అవేవీ మనసుకు రాక ఇప్పుడీ సంగతెందుకు స్ఫురించిందా అని కల్యాణి కొంచెం బాధ పడింది.

మోహనరావు మంచి హుషారుగా బండి తోలు తున్నాడు. వేగంగా పోతున్న గుర్రాల కాలి గిట్టల నాడాలు రాళ్ళకు తగిలిన ధాటికి నిప్పురవ్వలు లేచి మూర్ఖుల ఔద్ధత్యం ముందు అసమర్థుల కెంత కోపం వచ్చినా అంతే అని ఋజువు చేస్తూ ఇట్టే ఆరిపోతున్నాయి. ఎంతో దూరంలో ఉన్నవి ఇట్టే దగ్గిరయిపోతూ చూచినకొద్దీ మహా ప్రవాహం పొంగి పొర్లి ఎదురు పారుతున్నట్టు కనిపిస్తోంది రోడ్డు.

ఆ వేగం మొదట్లో కష్టమే అనిపించింది కల్యాణికి. కాని లలితను త్వరగా కలుసుకోవచ్చును గదా అని అంత లోనే ఆమె మనస్సు సమాధాన పడింది. అదీగాక కమాను బండిలో కుషను సీ టాయె! అంచేత కుదు పేమీ తెలియక శరీరానికికూడా సుఖంగానే ఉంది.

మోహనరావు మాట్లాడడం లేదు. అతని కెంతసేపూ లక్ష్యాన్ని త్వరగా చేరుకోవాలని మాత్రమే ఆదుర్దాగా ఉన్నట్లుంది. అంచేత కల్యాణి మౌనంగా ఉండిపోవడం ఇష్టం లేకపోయినా ఆమె వంకే చూడకుండా తోల్తున్నాడు. పైగా అక్కడక్కడ ఎదురవుతున్న పశువులను విడిస్తే నిర్జీవంగా ఉన్న రోడ్డు అతని విహారాని కనుకూలంగా ఉంది.

అప్పుడే జగ్గులపల్లి కూడా వెళ్ళిపోయినట్లుంది. ఈ లెక్కనే పోతే తోట చేరుకోవడానికి మరి పదినిమిషాలు కంటె ఎక్కువ పట్టదు. చెట్ల నీడవల్ల రోడ్డుమీద వెలుగెక్కువ లేకపోయినా పొద్దు చాలానే ఉంది.

అంతలోనే బండి వేగం క్రమంగా తగ్గిపో సాగింది. ఎందుకా అని కల్యాణి అటూ ఇటూ చూసింది. ఎదురుగా ఎవరిదో చిన్నకారు వస్తోంది. మోహనరావు వెనక్కి తిరిగి చూచాడు.

'ఇంకా ఎంతదూరం ఉంది?'

'వచ్చేశాం. రెండు మైళ్ళే!'

వెనకటి సువాసనే మళ్ళీగుప్పు మన్నది. అటూఇటూ ఎంత చూచినా ఎక్కడినుంచి వస్తోందో తెలియడం లేదు. మనసులో తళుక్కున మెరిసినట్టయి కల్యాణి కాశ్చర్యమూ, అనుమానమూ ఒక్కసారి కలిగాయి. ఇందాక అన్నిసార్లు వచ్చిందిగూడా ఇతని దగ్గర నుం చేమో అనిపించింది. అయితే మోహనరావు అలాంటివాడా ? సూర్యం ఎన్నడూ చెప్పలేదే !

మళ్ళీ బండి వేగ మందుకుంది. ఆమె మోహన రావును గూర్చే ఆలోచిస్తోంది. అతనిలో మంచి నాగరక లక్షణా లున్నాయి. లలిత మాదిరిగానే తాము జమీందార్ల మన్న బెట్టుసరి లేకుండా తమతో మంచి స్నేహాంగా ఉంటూ ఉంటాడు. గౌరవానికి గౌరవం, చనువుకు చనువూ చూపిస్తూ ఎంతో ఆదరపాత్రుడుగా కనిపిస్తాడు. ఐశ్వర్యం ఉన్న చాలామంది మాదిరిగాక తగినంత చదువుకున్నవాడు కూడాను. అతన్ని గూర్చి అనుమానించడమే న్యాయం కా దేమో !

అంతలో తోట వచ్చేసింది. కాని మోహనరావు బండి ఆపలేదు.

'ఇలా గేటులో నుంచి పోనివ్వ రేం ?'

'అలా వాగు దారి వెంబడి పోదాం.'

'లోప లెవరూ ఉన్నట్టు లేదే ?'

'వాళ్లు కూడా అటే కూర్చుని ఉంటారు.'

వెనక నుంచి గాలి జోరుగా తోల్తోంది. అంచేత ఈ సారి వాన నేమీా తెలియడం లేదు. దీంతో ఆమెకు కలిగిన అనుమానం పోయినట్టే అయింది.

బండి రోడ్డు దిగి నెమ్మదిగా పోతోంది. చక్రాలు ఇసుకలో కూరుకు పోతూ ఉండడం వల్ల ఇష్టంలేని వ్యక్తిని బలవంతాన ఈడ్చుకు పోతున్నట్లు గుర్రాలు బండిని కష్టం మీాద లాగుతున్నాయి.

బర్రు బర్రు మంటున్న బండిచప్పుడు తప్ప కల్యాణి కిం కేమీా వినిపించడం లేదు. ఆ దారిన మరోబండి పోయిన జాడ కూడా కనిపించడం లేదు.

బండి ఆగింది. కల్యాణి ఆదుర్దాతో నాలుగు పక్కలా చూచింది. ఎటు చూచినా ఎవ్వరూ కనిపించడం లేదు. ఆమె క్షణంసేపు నిర్ఘాంతపోయింది. ఆమె మనస్సులో అనేకాలోచనలు ఒక్కమాటు గిరగిరా తిరిగాయి. కాని అంతలోనే తన్ను తాను కుదుట బరుచుకుంది.

అనుకున్న దనుకున్నట్టే జరుగుతున్నట్టు ఏ విధమైన సంచలనమూా లేకుండా మోహనరావు బండి దిగాడు.

'లలి లేదీ?'

'చూద్దా మెక్కడుందో, బండి దిగండి!'

అతని నవ్వు ముఖం చూచేసరికి తన ఆందోళ నంతా వట్టి భ్రాంతిమూలక మనుకున్నది కల్యాణి. అన్నకంటే సన్ని

హితుడైన అతన్ని గూర్చి అన్యాయపు టూహాలు కలుగుతున్నందుకు ఆమె తన మనస్సును తానే నిందించుకుంది.

మోహనరావు బండి తలుపు తెరిచి పట్టుకున్నాడు. కలుషితమైన మనస్సుతో అతన్ని చూడలేక తల వంచుకునే దిగింది కల్యాణి.

అతను చిరునవ్వు నవ్వుతూనే తలుపు వేసేసి గుర్రాల నోళ్లల్లో కళ్లాలు తీసి, బండికింద వేలాడ గట్టిన పట్టాలో నుంచి కొంత మేత తీసి, వాటి ముందు వేసి ఆమె దగ్గరకు వెళ్లాడు. ఆమే ముందు తోటవైపుకు దారి తీసింది.

ఇద్దరూ పక్క పక్కన ఇసుకవాగులో నడుస్తున్నారు. పైకి చల్లగా ఉన్నా లోపల కాలి ఉన్న ఇసుక. నడక సాగడం లేదు.

'వాళ్లు గేటులో నుంచే వచ్చి లోపల కూర్చుని ఉంటారు.'

'అంతే అయి ఉంటుంది. కాని లలిత వాగు దగ్గర ఉంటా మని చెప్పింది, అందుకని ఇటు తీసుకు వచ్చాను. మొత్తానికి బలేదే!'

'అయితే వచ్చి చాలా సే పయిం దేమో! చూచి చూచి కాకపోతే అటు వెళ్లా రనుకుంటాను.'

'కావచ్చు. అయినా నాతో అలా చెప్పినప్పుడు ఇక్కడే ఉండ వద్దూ!'

సమాధానం చెప్పవలసి వచ్చినప్పు డల్లా మోహన రావు ముఖం పక్కకి పెట్టి చెప్తున్నాడు. కల్యాణి తన ఆదుర్దాలో తాను ముందు పోతూందే గాని అతన్ని చూడ్డం లేదు.

ఎంత తోసేసుకోవా లనుకున్నా ఆమె మనస్సు సందేహిస్తూనే ఉంది. తన దేమీ తప్పు లేనట్టు మోహన రావు సమర్థించుకుంటూనే ఉన్నాడు. అలా సంభాషిస్తూనే ఇద్దరూ తోటలోకి వెళ్లారు.

కాని లలి తేదీ? ఆమె రానే లేదు. అదేం వచ్చిందో ఆ పూట మామూలుగా తోటలో ఉండేవాళ్లు కూడా అక్కడ లేరు. ఉన్నది తన పక్కన మోహనరా వొక్కడే! ఆమె కాందోళన ఎక్కువైంది.

'రా లేదే లలిత!'

'అదే ఆశ్చర్యంగా ఉంది. కాసేపటికి వస్తుందేమో! మనంపోయి వాగు దగ్గరే కూర్చుందాము.'

మనసులో అనుమాన సైన్యాలు దండయాత్ర సాగిస్తు న్నాయి. ఆమె హృదయం వాటితో యుద్ధం చెయ్యలేక సత మత మవుతోంది. పక్కన మోహనరావు దీర్ఘాలోచన చేస్తు న్నట్టు బరువుగా నడుస్తున్నాడు.

బండి ఆగిన చోటు వచ్చింది. అప్పటికీ ఎవరూ వచ్చినట్టు లేదు. ఆమె కధైర్యం హెచ్చిపోయింది.

'అయితే మనం వెళ్లిపోదాము' అన్న దామె అప్రయత్నంగా.

అకస్మాత్తుగా వచ్చిన ఈ సూచన మోహనరావుకు బాణంలా తగిలింది. కాని అతను సంచలనం ప్రకటించక 'అప్పుడే! ఇంకా అయి వుండదు. ఒక్క గంట సేపుండి అప్పటికీ రాకపోతే అలాగే వెళ్లిపోదాం' అన్నాడు ఆదుర్దాతో.

అత నన్నట్లు పొద్దు చూస్తే చాలానే ఉన్నది. తీరా తాము వెళ్లాక లలిత వస్తే అదీ బాగుండదు. ఏ నిశ్చయానికీ రాలేక మాట్లాడకుండా కూర్చున్నది కల్యాణి.

ఆమె మనస్సు అనంతమైన సంక్షోభం పొందుతోంది. మోహనరావు ఎదురుగా కూర్చుని తన పాచిక పారిం దన్న సంతోషంతో చేత్తో ఇసక తీసి ఉల్లాసంగా ఎగరేసి పట్టు కుంటూ ఆలోచిస్తున్నాడు.

ఎలాగో అరగంట గడిచింది.

కల్యాణి కిక ఉండ బుద్ధి వెయ్యడం లేదు. క్షణం గడి చిన కొద్దీ ఏదో మహాభారం నెత్తిన పడి కుంగదీస్తున్న ట్టని పిస్తోంది కాని అతను అదీ ఇదీ చెప్పి కదలనివ్వడం లేదు. అక్క డిక కాలక్షేపం ఎట్లా చెయ్యడం? ఆమె క్షణాలు లెక్క పెడుతూ కూర్చుంది.

అంతలో డొంక మలుపు దగ్గర మనుష్యుల అలికి డయింది. లలితా వాళ్ళే నేమో అని ఆమె ఆదుర్దాతో అటు చూచింది. అక్కడ కట్టెలు కొట్టుకు వస్తున్న గమళ్లా

ళ్లిద్దరు కనిపించారు. ఆమె నిట్టూర్పు విడుస్తూ కుంగి పోయింది.

తమవంకే చూస్తున్న మోహనరావును చూచి గమళ్ళాళ్ళిద్దరూ భయంతో నిలబడిపోయారు.

కల్యాణివైపు తిరిగి 'ముంజెలు కొట్టించనా ?' అన్నాడతను.

కాలక్షేపానికి దొరికే ఉపాయమనుకుంటూ ఆమె 'సరే' అన్నది. అదీకాక ఎండలో రావడం వల్ల మంచి దాహంగూడా వేస్తోంది.

ఒక గెలలో కాయలన్నీ సరికి కళ్లు తెరిపించి పచ్చి తాటాకు మీద పరిచి పెట్టారు గమళ్లాళ్ళు.

మోహనరావు బొటన వేలితో ముంజెలు తీసు కుంటూ రెండుమూడు కాయలు తినేశాడు. కాని కల్యాణి అలా తినలేకపోయింది.

'కళ్ళు తీసి ఇవ్వలేరూ ?'

'చిత్తం, చిత్తం' అంటూ వాళ్ళు మరో ఆకుమీద తీసిన ముంజెలు పెట్టుతున్నారు. కల్యాణి నాలుగు రెండు మాత్రం తీసుకుని వాటితోనే అయిష్టం పుట్టి పరధ్యానంగా ఉండిపోయింది.

'ఏం మానేశారేం ?'

'చాలు, చాలు'

'మరివన్నీ ఏం చేద్దాం ?'

'ఉంచమనండి, మనవాళ్ళు వస్తారుగా !'

కల్యాణి ఈ మాట ఉద్దేశ పూర్వకంగా అనలేదు. అయినా ఇది మోహనరావుకు సంతోషాన్నే కలిగించింది. దాంతో అతను 'అవు నవును. ఆ గెలా, కొడవలీ ఇక్కడ ఉంచి మీరు పొండిరా!' అన్నాడు.

స్వంత భూముల్లో తాటిచెట్ల ఆకులు కోసినా, గెలలు కోసినా ఆసాములు శిక్షకింద గమళ్ళాళ్ళ కొడవళ్ళు లాక్కో వడం పరిపాటి. జమీందారు భూముల్లో అయితే అంతతో పోక జుల్మానాగూడా ఉంటుంది. అది తప్పిందిగదా అని వాళ్ళిద్దరూ మారుమాట్లాడకుండా వెళ్ళిపోయారు.

కల్యాణి మనసులో లలిత వస్తుందన్న నమ్మకం క్షణ క్షణానికీ సన్నగిల్లుతోంది. వాలుతున్న పొద్దును చూచిన కొద్దీ ఆమె కాందోళన ఎక్కువవుతోంది.

గమళ్ళాళ్ళు తీసి పెట్టిన ముంజెలన్నీ తినేసి 'నాకు కళ్ళు తియ్యడం చేతనవును. ఒక్కటి తీసివ్వనా?' అన్నాడు మోహనరావు కొడవలి అందుకుంటూ.

అతను కళ్ళేకాదు, గుండెలుకూడా తియ్యగలడన్న సంగతి కల్యాణి కింకా తెలియలేదు. అందుచేత ఆమె ఆదు ర్దాతో 'వద్దుగానీ – ఇంక వాళ్లు వచ్చేటట్టు లేదు. మనం వెళ్ళిపోదాం' అన్నది బతిమాలుతున్నట్టు.

అతడు ఒడుపుగా 'ఊరికే అంత తొందరపడతా రేం! పొద్దు గూకినా మంచి వెన్నెల రోజులు, ఈ వాగులో ఎంత బాగుంటుంది?' అన్నాడు నవ్వుతూ.

ఈ మాట ఆమెకు వెన్నులో పొడిచినంత బాధ కలిగించింది. ఇంతవరకూ తాను భ్రమపడడమేగాని లలితకోసమతను చూడడం లేదన్నమాట.

కల్యాణి అతనివంక తీక్ష్ణంగా చూచింది.

అతను మొదట్లో చలించినా వెంటనే నవ్వేసి సద్దుకుంటూ 'ఎందుకలా చూస్తారు? ఒక్కటి తినండి నాకోసం' అన్నాడు ఆప్యాయంగా.

అతని కోసం తాను తినాలా? ఆమె భరించలేక చటుక్కున నిలబడింది.

మోహనరావుకూడా లేచాడు. అతనింకా కొడవలి పట్టుకునే ఉన్నాడు.

ఆమె పెడమొగం పెట్టి నిర్లక్ష్యంగా చూస్తూ బండివైపు అడుగు వేసింది. మనసులోకి ఎంత నిబ్బరం తెచ్చుకుంటున్నా కాళ్ళుమాత్రం గజగజ లాడుతూనే ఉన్నాయి.

మోహనరావు కాసేపు నిలబడి ఆలోచించాడు. కొంచెం తొందరపడినా ఉపక్రమణిక బాగానే ఉందనిపించింది. కొడవలిని అక్కడ పడేసి తానుకూడా బండివైపు బయలుదేరాడు.

ముందు వెళ్తున్న కల్యాణికి వెనక వస్తున్న మోహనరావు తన గుండెలమీదే అడుగులు వేస్తున్నట్టనిపించింది.

ఆమె అలాగే తడబడుతూ వెళ్ళి బండిలో కూలబడింది. మోహనరావు వచ్చి లోపలున్న బక్కెట్లో నీళ్ళ

పెట్టి చేతులు కడుక్కున్నాడు. రుమాలుతో చేతులు తుడుచు కుంటూ వచ్చేటప్పుడె తాను కూర్చున్న సీటు దగ్గరికి వెళ్లాడు.

ఆ క్షణంలో కూడా తానే అనవసరంగా పొరపడు తున్నానేమో అనుకున్నది కల్యాణి.

కాని మరుక్షణంలో ఆమె పొరపడడం లేదని స్పష్ట మయింది. అత నక్కడికి వెళ్ళింది బండి నడిపేందుకు కాదు. ఉన్నవా డున్నట్టు దురూహ బైటపెట్టే శక్తి లేక సహాయం కోసం వెళ్ళాడు.

ఎదురుగుండా కనిపిస్తూ ఉంటే ఇంక సందేహాని కవ కాశ మేముంది? మధ్యాహ్నం తమ ఇంటికి వచ్చిన దగ్గర నుంచీ అత నాడిన ప్రతిమాటా, చేసిన ప్రతిచేష్టా అసలు స్వరూపంతో ప్రత్యక్షమవుతూ ఆమె కెక్కడలేని భయాన్నీ కల్పించ సాగాయి.

ఇందాక, కదల నట్టే కనిపించిన కాలం ఇప్పుడు పరు గెత్తుకు వచ్చి మీద పడుతున్న ట్టుంది. అందులో ఆమె బండిలో కూర్చున్నందువల్ల బైటికంటే లోప లెక్కువ చీక టిగా ఉంది. అయినవాళ్ళ నుండి దూరమయ్యా మని కాబోలు సంజవేళ గూళ్ళకు వెళ్ళే పక్షులు అరుస్తున్న అరు పులు ఆక్రందనాల్లా వినిపిస్తున్నాయి. సృష్ట్యాది నుండీ నిశా గర్భంలో ప్రకోపిస్తున్న ఘోరాన్యాయాలకు నిరసనగా కీచు రాళ్ళు గుంయి మంటూ నిర్వేదనం ప్రారంభించాయి.

ఆమె కన్ను గప్పి దారిపొడుగునా తాగింది చాలక ఇప్పుడు నిర్భయంగా మరింత వేసి ఆ సరంజాంతోనే అతను ఊగులాడుతూ వస్తున్నాడు. అతని కళ్లల్లో ఎర్రజీరలు ఆ మసక వెల్తురులో కాలిన యినప కొర్రుల్లా కనిపిస్తున్నాయి. గాలికి తల అంతా చెదిరిపోయి చింపిరి దయ్యంలా ఉన్నాడు.

ఆమె చూడలేక కళ్ళు మూసుకుంది. కాని వినపడు తున్న అడుగుల చప్పుడుకే ఆమె గుండె దడదడ లాడ సాగింది.

అత నలాగే వచ్చి తలుపు తెరిచి దాన్ని పట్టుకునే నిలబడ్డాడు.

ఆ చప్పుడు కామె అదిరిపడి కళ్లు తెరిచింది.

'కల్యాణీ!!'

ఆమె ఒళ్ళంతా కంపర మెత్తిన ట్టయింది. నాలుగు పక్కలా కొంపకు నిప్పంటుకున్న దని తెలిసినా తప్పించుకో లేని పంజరపు చిలుకలా ఉంది కల్యాణి.

'ఇంకా లలిత వస్తుం దనుకుంటున్నావా? రాదు. అవసరమైన జాగ్రత్తంతా తీసుకునే ఇంతదాకా తెచ్చాను. మర్యాదగా నా కోర్కె తీర్చు.'

భర్త స్నేహితుడు, స్నేహితురాలి అన్న, అన్నవలె ఆపేక్ష ప్రకటిస్తూ దగ్గర చేరిన పెద్దమనిషి అలా అంటుంటే పైపై మెరుగు చూచి హృదయాన్ని గ్రహించలేక బుజ్జ

గిస్తున్న కసాయివాడి చేతిలో అమాయికంగా తలపెట్టిన మేకలా పట్టుపడి పోయిన ఆమె ఏమన గలదు!

'ఏం మాట్లాడ వేం? కిందికి దిగు. ఇలా వెన్నెల్లో కూర్చుందాము.'

అతని చెయ్యి లోపలికి వస్తోంది. పడగె_త్తిన పామో అన్నట్టు కల్యాణి పక్కకు పక్కకు జరిగింది. ఆమె చెయ్యి అప్రయత్నంగా అటుపక్క తలుపు ఉందేమో అని చూచి నిరాశవల్ల నీరసించి వేలాడిపోయింది.

'అనవసరంగా నన్ను రెచ్చకొట్టకు. నా చేతిలో పడ్డాక తప్పించుకు పోవడమే. మొండితనం చెయ్యక దారికి రా!'

ఆమె కేడుపు వచ్చేసింది. బతిమాలుకుందా మన్నా గొంతు పూడిపోయినట్టు అయింది.

అతను మళ్ళీ గ్లాసులో పోసుకు తాగుతున్నాడు. చేస్తున్న మహాకార్యానికి సత్తువ చాలడం లేదు కాబోలు.

'దిగవా!'

ఆమె కేం చెయ్యాలో తోచడం లేదు. అతన్ని లోపలికి రానివ్వడం కంటే తానే దిగితే పారిపోవడానికి వీలుంటుందేమో అనిపించింది.

ఆమె దిగబోతుండడం చూచి మహారాణి వచ్చే టప్పుడు దాసునిలా ఘోషానరావు తొలగి నుంచున్నాడు,

అదే అదనని ఆమె తడబడుతూ పరుగెత్తబోయింది. కప్పను పట్టే పాములా చెయ్యి చాపి పట్టేశాడు మోహన రావు. ఆమె విడిచిపెట్టమని బతిమాలుతూ కింద కూలబడి పోయింది. అతను విడవలేదు సరిగదా చిరునవ్వు నవ్వుతూ ఆమె కెదురుగా కూర్చున్నాడు. చేజిక్కిన మృగ మరిచే అరుపులు వ్యాఘ్రపు హృదయాన్ని ఏం కదిలిస్తాయి ?

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూ ఎంతెంతో బతిమాలు కుంది. సూర్యానికీ అతనికీ ఉన్న స్నేహం జ్ఞాపకం చేసింది. ఇంతటి మిత్రద్రోహానికి శిక్ష ఉండకుండా పోదని బెదిరించింది. అప్రతిష్ఠతో బ్రతకడంకంటే ఆత్మహత్య చేసుకోవడం మేలని హెచ్చరించింది. తాత్కాలిక సుఖంకోసం వంశానికే అపకీర్తి తే వద్దని హితబోధ చేసింది. లలితకూ తనకూ ఉన్న స్నేహం చెప్పి నీ చెల్లెల్ని ఎవరైనా ఇలా చేస్తే సహిస్తావా అని హృదయాన్నికూడా స్పృశించింది.

అతను మనసులో కదలాడిపోయినా చెయ్యిమాత్రం వదలలేదు. తిరిగి తిరిగి గానుగెద్దు బయలుదేరిన చోటుకే వచ్చేటట్టు అతని మనస్సు ప్రథమ నిశ్చయంలోనే స్థిరపడి పోతోంది.

'ఎందుకీ బలవంతం ? నా శవాన్ని చూడాలని ఉందా ?'

శవం ? తాను కోరే దేమిటి ? ఆమె అనే దేమిటి !

అత నొక్కమాటు పకపకా నవ్వాడు. ఆ నవ్వు వెయ్యి గుడ్లగూబలు అరిచిన ట్లుంది.

'అయిందా ఉపన్యాసం? నీ నీతులూ, వేదాంతాలూ ఎవడికి క్కావాలి? అనవసరంగా కష్టం తెచ్చుకోక నే చెప్పినట్టు విను' అంటూనే అత నామెను దగ్గరకు లాక్కున్నాడు.

ఆమె అత్యంతోద్రేకంతో బలవంతాన నెట్టేసింది. అనుకోకుండా వచ్చిన ఈ తోపుడుకు అతను వెల్లకిలా పడి పోయాడు.

చర్రున లేచి వెళ్లి ఆమె జబ్బ పట్టుకున్నాడు మోహన రావు. వెర్రి పట్టుదలతో ఆమె పెనగు లాడింది.

ఈ సంచలనం గిట్టక కాబోలు బండి గుర్రాలు సకిలించ సాగాయి.

కాని పైశాచిక కామోద్రేకంతో విరుచుకు పడుతున్న ఆ మనిషికీ, ప్రాణంకంటే విలువైన మానం కోసం పెనగులాడుతున్న ఆ ఇల్లాలికీ వీటి గొడవే పట్టడం లేదు.

పది నిమిషాలు గడిచే సరికి కల్యాణి కాళికాదేవే అయింది. కంచుకం చిరిగి, కచబంధం ఊడి, రొమ్ముమీదా ముఖంమీదా గోళ్ళు పడి గీరుకుపోయి నెత్తురు కారుతున్న గాయాలతో ఆమె రూపం అన్యాదృశ్యమే అయింది. నెత్తురంతా ఎగదట్టి కళ్లు రెండూ విస్ఫులింగాల్లా ధగధగ లాడుతున్నాయి.

ఆ రూపం మోహనరావుకు ఆశ్చర్యంతో పాటు ఆవేశాన్ని కలిగించింది అత నమాంతం దూకి ఆమెను చేతు

లతో చుట్టేశాడు. ఆమె ఆదువులేలే అయి పళ్లతో కొరికింది, గోళ్లతో రక్కింది. 'అబ్బా' అనుకుంటూ అత నామె నొక్క తోపు తోశాడు.

ఆమె తూలిపోయి ముంజికాయలకు దగ్గరలో వెల్లకిలా పడిపోయింది. జీవుల కపకారం చేస్తే మానవుడు చెయ్యాలి గాని మేము చెయ్య మన్నట్లు అవి ఆమెకు తగలలేదు.

ఆ కాలంలో నిశానాథుడు ఈ అత్యాచారాన్ని చూస్తూ కూడా నవ్వుతున్నట్టు వెన్నెలలు కాస్తున్నాడు.

వాగు వెంబడి పొదల్లో నుండి కీచురాళ్ల ధ్వని మహా భయంకరంగా వినిపిస్తోంది. అప్పుడప్పుడు గుడ్లగూబల అరుపులు దాన్ని మరింత భీకరం చేస్తున్నాయి. శవాల కోసం కాట్లాడుకుంటున్న నక్కల కూతలు కూడా వీటికి తోడవుతున్నాయి. ఈ ధ్వనులకు మధ్య మధ్య కలుగుతున్న విరామం మరీ దుర్భర మవుతోంది.

పడిపోయిన కల్యాణి సడలిన ధైర్యంతో నీరసపడి కాసేపు రెప్ప వాల్చింది.

ఆమెను చూస్తున్న మోహనరావు ఆగలేక పోయాడు. మద్యంతో మరింత సత్తువ పోసుకొని నిద్రపోతున్న పామును పట్టబోయే గద్దలా దూకాడు మీదికి.

ఆమె గిలగిలలాడిపోతూ చేతి కందిన ఇసుకే తీసుకుని అతని ముఖాన కొడ్తోంది. కళ్లు కనబడక ఉక్కిరి బిక్కిరి అవుతున్నా అతను తన ప్రయత్నం మానడం లేదు.

దురాక్రమణ దౌష్ట్యం ముందు దారుణ మారణాయుధాలే నిరుపయోగ మవుతుంటే కలిసి ముద్ద కాలేని ఇసు కేం చెయ్య గలుగుతుంది!

కాని ఆ ఇల్లాలు ఆ ఇసకలోనే విశ్వాసం ఉంచి దాంతో అతన్ని విసిరి కొడ్తోంది. అది పూలజల్లు అనుకుంటు న్నాడు కాబోలు అతను వెనుకాడడం లేదు.

చటుక్కున ఆమె చేతికి ఇసుకతో పాటు ఏదో తగి లింది. ఒళ్లు తెలియని స్థితిలో ఉన్న ఆమె అ దేమిటో చూడ నైనా చూడకుండా వాలి ఉన్న అతని మీదికి విసిరి వేసింది.

వెంటనే ఆమె ముఖ మంతా తడిసి నట్టయి వంటి మీద పెద్ద బరువు పడ్డ ట్టయింది. చేతులతో ముఖం తుడుచు కుంటూ మీద పడ్డ బరువును పక్కకు దొర్లించి కష్టంమీద లేచి కూర్చుంది కల్యాణి.

ఆమె చేతికి చిక్కింది అతనే సమకూర్చి పెట్టిన కొడవలి కాబోలు, పక్కన పడి ఉన్నది మొండెం. తాటి కాయలతో కలిసిపోయిందో ఏమో తలమాత్రం కనబడ లేదు.

ఆమె కాసేపటి వరకూ కదలలేక పోయింది.

ఆకాశంలో చంద్రుడు మాత్రం అప్పటికీ నవ్వు తున్నట్టే వెలుగు తున్నాడు.

ప్రగతి — 1950.



# స్త్రీ స్వాతంత్ర్యం



ఆంధ్ర సారస్వత సంఘం కార్యదర్శి ఆడపిల్లల గది దగ్గరకు వెళ్ళాడు. కాలేజీ బంట్రోతు లోపలికి వెళ్లి చెప్పగా లలిత కర్టెను దగ్గిరికి వచ్చింది. తక్కిన ఆడపిల్లలు గూడా వచ్చి ఆమె వెనకాలే గుమిగూడారు.

ఇంటర్వెలులో ఇళ్ళకు వెళ్ళని కుర్రాళ్ళని ఈ సమావేశం ఆకర్షించింది. కార్యదర్శి అక్కడికి వెళ్తాడని అందరికీ తెలుసును కాబోలు - కుర్రా ళ్ళందరూ గుమ్మాలలోనే నిలబడ్డారు. కొందరు వరండాలో పచార్లు గూడా ప్రారంభించారు. లలిత ముఖం కనిపించడంతోటే 'చూడు! చూడు! నాయకురాలు!' 'నాయకురాలు కాదోయ్! ఉపన్యాసకురాలు!' 'నేనంటే కాదన్నావు. ఇప్పుడు తెలిసిందా?' 'దీని కేం గాని కాటుకపిట్ట నెన్నడైనా చూశావ్!' ఇత్యాద్యాఖ్యానాలు శరపరంపరగా విజృంభించాయి. వీటిల్లో దురుసువాళ్ళు వదిలినవి ఆ గదిదాకా వెళ్తున్నాయి, కొంచెం ఓపిక తక్కువ వాళ్ళవి సగంసగం సమీపిస్తున్నాయి, తక్కినవి గాలిలో బుసబుస లాడుతున్నాయి.

'ఆడవాళ్ళ తరఫున ఎల్లుండి డిబేటులో మీరు పాల్గోవాలి' అన్నాడు కార్యదర్శి.

'మనస్ఫూర్తిగానే అడుగుతున్నారా?'

'కాకపోతే ఇందాకా రావడ మెందుకు?'

'నిజమే అనుకోండి. ఇష్టముంటే మేమే పేర్లిస్తాం గదా అని ఊరుకోక వచ్చి పిలిచారు. చాలా సంతోషం. కాని ఈ పరిస్థితుల్లో...'

'అందుకనే మీరు తప్పక మాట్లాడాలని నా ఉద్దేశం.'

'అంటే మాకు స్వాతంత్ర్యం కావాలని మన్నల్నే వాదించుకోమంటారు' అంటూ లలిత చిరునవ్వు నవ్వింది.

కార్యదర్శిగూడా నవ్వుతూ 'ఒప్పుకున్నట్టే గదా!' అన్నాడు.

కర్టెను వెనకాల ఆడపిల్లలంతా 'వద్దు, వద్దు' అని లలితకు సలహా ఇచ్చారు. అయినా ఆమె 'నా పేరు వేసుకోండి' అని చెప్పి 'అనుకూలంగా కాదు, వ్యతిరేకంగా మాట్లాడతాను' అన్నది.

కార్యదర్శి 'మీ ఇష్టం' అంటూ వెనక్కి వచ్చేశాడు. కర్టెను వెనకాల లోపలికి వెళ్ళుతూ కనిపించిన పిల్లల్ని గూర్చి, నవ్వుతూ వస్తున్న కార్యదర్శిని గూర్చి కుర్రాళ్ళు రకరకాలుగా చెప్పుకుని సంతోషంతో విరగబడి పోయారు.

అంతలో ఒకటి మ్మనప్పవయి మధ్యాహ్నం కాలేజీకి మొదటి గంట కొట్టారు. అంతవరకూ గదికి పది పదిహేను మంది కంటే ఎక్కువలేని కుర్రాళ్లు ఇప్పుడు వాళ్ళవాళ్ళ తరగతుల ప్రమాణాన్నిబట్టి అరవైలు డెబ్భైలుగా పెరిగి పోయారు. గదులు, వరండాలు, దార్లు – అన్నీ కుర్రాళ్ళ

మయమే. గంట కొట్టడంతోటే ఇంతమంది కుర్రాళ్లు ఒక్క చోట చేరుకోవడంచూస్తే ఎండాకాలమంతా ఎక్కడెక్కడో దాక్కుని వానకురవడంతోటే ఒక్కసారి బైటికివచ్చే కప్పల గుంపులు జ్ఞాపకం వస్తాయి. అందులో అందరూ పది హేను, ఇరవై యేళ్ళ నడిమి వయసువాళ్లే అవడంచేత శరీరాల్లో పొంగుతున్న వేడినెత్తురుకు తగిన పని లేక వాళ్ళు చేసే నానావిధ వ్యక్తావ్యక్త ధ్వనులూ దూరంనుంచి ఆలకిస్తే లయ లేకపోయినా ఆ బెకబెకలకు సమానంగానే ఉంటాయి. కుర్రాళ్ళేకాదు, ఈ రోజుల్లో అంతమంది పెద్ద వాళ్ళుకూడినా అంతే!

కొంచెం సేపట్లో రెండోగంట కొట్టడం మొదలు పెట్టారు. అన్ని గదుల్తో పాటు ఇంటర్మీడియేటు మూడో గ్రూపు తరగతి గదికూడా కిటికీలలోనుంచీ, గుమ్మాలలో నుంచీ కుర్రాళ్ళు గబగబా లోపలికి దూకి పోగా బైలుదేర బోయేముందు మెయిలు ట్రెయినులో మూడో తరగతి పెట్టెలా ఒక్కమాటు కిటకిట లాడిపోయింది. గాలరీలో కిటికీల దగ్గర కూర్చుని లెక్చరరు వచ్చి అటెండెన్సు వేసుకోవడంతోటే జారిపోదామనుకుంటున్న వాళ్లను అప్పుడే కిటికీలలో నుంచి లోపలికి వచ్చినవాళ్ళు జరగమంటుంటే వాళ్ళు జరగడం లేదు. అంచేత అల్లాంటివాళ్ళు బూటుకాళ్ళతో బల్లలమీద నడుస్తూ ఖాళీచోట్లకు ప్రయాణం చేస్తున్నారు. ముందు వరసలో కూర్చున్న ఒక కుర్రాణ్ని వెనకవరసలో

మిత్రుడు కేకేస్తే చుట్టుతిరిగి ఎవడు పోతాడని వాడు బల్లల మీదినుంచి దేకుతూనే పైకి వెళ్ళిపోతున్నాడు. కొందరు తమ పుస్తకాలు ఒకచోట్లో పడేసి ఎక్కడికో వెళ్లి మళ్లీ వచ్చే టప్పటికి అవి అక్కడ కనబడక వాటికోసం వెతుక్కుంటూ వాణ్నీ వీణ్నీ అడిగి వాళ్ళు తమకు తెలియదని దబాయి స్తుంటే చేసేదిలేక తిట్టుకుంటూ, తిట్లుతింటూ, తిరుగు తున్నారు. ఇంకా లెక్చరరు రాలేదే అని కొందరు కుర్రాళ్ళు పైనుంచి కిందిదాకా ఉన్న బల్లల కూర్పుమీద ఊతంగా నడిచి ధ్వని చేసుకుంటూ గుమ్మముదాకా పోయి 'వస్తు న్నాడు, వస్తున్నాడు' అని క్లాసును హెచ్చరించి తమాషా చేసి సంతోషిస్తున్నారు. ఎంతైనా ఇలాంటి కాయిక వ్యాపా రాలకంటే ఆ గదిలో వాగ్వ్యాపారమే అధికంగా ఉన్నది. తక్కినవాళ్ళంతా నిశ్శబ్దంగా ఉండి తన మాట పక్క వాడికి వినిపించాలని తొంభైతొమ్మిది మంది యువకులు ఎవరికివారు ప్రయత్నిస్తూ ఉంటే అక్కడ ధ్వనికాక మరేక్క డవుతుంది? దూరంనుంచి అక్కడి ధ్వని అర్థంకాదుగాని దగ్గరకుపోయి వాళ్లల్లో ఒకరుగా ఉండి వింటే 'ఆ పుస్తకం ఇటివ్వరా!', 'బలే గ్రేడు తిన్నాడు రా'. 'ఏడిశావ్లు ఉండవోయ్', 'ఏదేది! బలేపోజు, బలేపోజు!', 'చల్ చల్ రే నౌజవాన్', 'కాదురా గుర్రమే వెనకా లొస్తోంది. అది కనిపెట్టి వెళ్తూవెళ్తూ ఉన్న రామంగాడు తక్కువ ఆగి పోయాడు ఇంకేముంది—' 'మొట్టమంకాయ వెళ్ళిపోతున్నా

డటరోయ్ ', ' ఈ వెన్నెలరేయిూ హాయిూ ', ' ఏం చేస్తే మాత్రం పూ లంటాడా వాడు ! ', ' నువ్వేమన్నా అను. క్లాసంటే పరమాన్నంగాడి క్లాసే క్లాసు ', ' అదేం పత్తిత్తు అనుకున్నావా ఏమిటి ? ' ఇల్లాంటి సందర్భపూర్వక వ్యాఖ్యలు వ్రాస్తేనే గాని అర్థంకాని వాక్యాలు కొల్లలు కొల్లలుగా వినిపిస్తాయి. ఏమయితేనేం, మొత్తమిూద ఆ గదిలో ధ్వనినిబట్టే వీథిలో పోయేవాళ్ళకు అది కాలేజి అని తెలుస్తోంది.

అంతలో లెక్చరరు బయలుదేరాడన్న సూచన వచ్చింది. గదిలో ధ్వని ఇంకా తగ్గలేదుకాని రైలు కదులుతున్నప్పుడు ఎక్కడమే ఘాషనయినట్టు వస్తున్న ఉపాధ్యాయుణ్ని చూచాకే క్లాసులోకి వెళ్ళాలని వరండాలో తిరుగుతున్న కుర్రాళ్ళుమాత్రం లోపలికి వెళ్ళారు. దాంతో లోపలి రొద ఒక విధంగా తగ్గింది. మరొక విధంగా అక్కడివాళ్లిక్కడికీ, ఇక్కడివాళ్ళక్కడికీ చోట్లు మారడంవల్ల హెచ్చింది.

ఆ స్థితిలోఉన్న గదిలోకి లెక్చరరు వెళ్ళాడు. చోటు కోసం వెతుక్కుంటూ నిలబడిఉన్న కుర్రాళ్ళతో ఉపాధ్యాయుడు వచ్చాడని గౌరవంతో నిలబడ్డ విద్యార్థులు కలిసిపోయి అది గౌరవమో అగౌరవమో తెలియకుండాపోయింది. వెళ్లినవాడు వెళ్లినట్లుగా లెక్చరరు వేదికమిూద నిలబడేఉన్నాడు. అప్పటికి కుర్రాళ్ళంతా

గుసలుగా రొదమాత్రం సాగుతూనే ఉంది. ఆలోగా ఆడ పిల్లలు వరసగా క్లాసు దగ్గరికి వెళ్ళారు. వాళ్ళకోసం ఖాళీగా ఉన్న మొదటి వరస బెంచీలో ఒక్కొక్కరే కూర్చుంటూ ఉంటే వెనకనుంచి వినపడీ వినపడకుండా, వ్యక్తి తెలియ కుండా ఏవేవో విసురుమాటలు గాలిలో బుస్సుబుస్సు మంటూనే ఉన్నాయి.

లెక్చరరు ఒక్కసారి బల్లకొట్టి నంబర్లు పిలిచి అటెం డెన్సు వేసుకున్నాడు. లేనివాళ్ళకు ఉన్నవాళ్ళు చెప్తున్నా, చెప్పినవాళ్ళు జారిపోతున్నా ఆ లెక్చరరు అష్టావధానం చెయ్యలేడు కాబట్టి విధిమాత్రం సాగిపోతూనే ఉంది. చివ రికి పదినిమిషా లయాక ఒక్కమాటు క్లాసువంక నాలుగు మూలలాచూచి పలచబడ్డ స్థానాలు కనిపించినప్పటికీ వ్యక్తులు తెలియకా, తెలిసినా ఏమీ చెయ్యలేకా ఆయన చెప్పవలసిన పాఠం ఆయన మొదలు పెట్టాడు.

అప్పటికి కుర్రాళ్ల గుసగుసల ధ్వనికూడా చాలా భాగం తగ్గిపోయింది. ఇంకా ఏ కొంచెం మిగిలిఉన్నా అది లెక్చరరు గొంతులో అణిగిపోయి బైటికిమాత్రం తెలి యడంలేదు. అంచేత పాఠం హాయిగా సాగుతోంది. వినే వాళ్ళు వింటున్నారు. తమకు తెలియనివి వ్రాసుకునేవాళ్ళు వ్రాసుకుంటున్నారు. పాఠ్య పుస్తకాల వంక చూస్తున్నట్లు నటిస్తూ మధ్య పెట్టుకున్న అభిమాన పత్రికల్ని చదువుకునే వాళ్ళు చదువుకుంటున్నారు. వెనక వరసలో ముందువాళ

వీపులను అడ్డం చేసుకుని తలవాల్చి నిద్రపోతున్న వాళ్ళను ఎవరూ పలకరించడం లేదుగాని వాళ్ళను చూసీ, లెక్చరరు వంక చూసీ కొందరు ముసిముసి నవ్వులతో కనపడీ కనపడ కుండా బాధపడుతున్నారు.

ఇంకో పావుగంట గడిస్తేనేగాని ఆ పిరియడు కాదు. అంతలో ఆడపిల్లల్లో ఏదో అలజడి బయలుదేరింది లెక్చరరు వాళ్ళవంక హెచ్చరికగా ఒకమాటు చూ చేసరికి వాళ్ళు మళ్ళీ వ్యగ్రులై పుస్తకాలవంక చూస్తూ ఉండిపోయారు. కాని మరునిమిషంలో లీల ఛఱ్ఱున లేచి బైటికి వెళ్ళిపోయింది ఆమె వెంబడే వెళ్లాలని లలితగూడా లేచింది. లెక్చరరు ఆదుర్దాగా 'ఏమిటేమి' టన్నాడు.

క్లాసంతా సూది వేస్తే చప్పుడయ్యేంత నిశ్శబ్దంగా ఉంది.

లలిత కాయన మాటలు వినిపించాయో లేదో ఆమె కూడా వెళ్లిపోయింది.

సంగతేమిటో తెలియక లెక్చరరు నిర్ఘాంతపోయాడు. ఆయనకు జరిగిన పరాభవానికి హర్ష సూచకంగా క్లాసులో మగపిల్లలంతా గొల్లుమన్నారు. లెక్చరరుకు నిజంగా కోపమే వచ్చింది. కాని క్లాసంతా కలిసి చేసినపని నలుగురిమాట చెల్లే రోజుల్లో తప్పెల్లా అవుతుంది? ఆయన ఏమీ చెయ్య లేక అంత కోపాన్నీ దిగమింగుకుని 'మీరుకూడా వెళ్లం' [illegible] తక్కిన ఆడపిల్లల్ని పంపించేశాడు.

మళ్లీ గొల్లుమన్నది క్లాసు. లెక్చరరుకు మళ్లీ కోపం వచ్చింది. ఈ సారి చెయ్యగలిగిం దేదో చేద్దామనే అనుకున్నాడు. కాని అంతలో బెల్లు కొట్టేశారు. లెక్చరరు ఇంకా అక్కడ నిలబడి ఉండగానే ఆయన దారి నడ్డగిస్తూ కుర్రాళ్లు తలకో కదారి చొప్పున దాటిపోయారు.

౨

లీల క్లాసులోనుంచి సరాసరి ప్రిన్సిపాలు గది దగ్గిరికి వెళ్ళింది. ఆయ నప్పు డదృష్టవశాత్తు ఖాళీగానే ఉన్నారు.

బొటబొట కన్నీళ్ళు కారుస్తూ ఎగరొప్పుకుంటూ లోపలికి వచ్చిన లీలను చూచి ప్రిన్సిపాలు కంగారుపడిపోయాడు. ఆయన సంగ తేమిటని అడగనైనాలేదు. లీలే రుమాలుతో కళ్లు తుడుచుకుంటూ 'నాకు టి. సి. (ట్రాన్స్ఫరు సర్టిఫికెట్టు) ఇచ్చెయ్యండి సార్ ! నేను వెళ్ళిపోతాను' అన్నది రుద్ధకంఠంతో.

ఈ మాట కాశ్చర్య పడి 'కాసేపు స్తిమితంగా కూర్చుని సంగ తేమిటో చెప్పమ్మా' అన్నాడు ప్రిన్సిపాలు.

లీల కూర్చోలేదు. అంతలో లలితకూడా అక్కడికి వచ్చేసింది.

'ఏమిటమ్మా ఇది ?'

లీల చెయ్యి పట్టుకుని ఒక కుర్చీలో కూర్చోపెట్టి తాను పక్కన నిలబడిఉండే లలిత చెప్పింది.

వాళ్ల కాసులో ఆడపిల్లల బెంచి వెనకాల ముగ్గురే ముగ్గురు కుర్రాళ్లు కూర్చున్నారు. ఎవరి కాలో తెలియలేదు గాని మొదట్లో లలితకు తగిలింది. ఆమె వెంటనే వెనక్కి తిరిగి చూచింది. కుర్రాళ్లు ముగ్గురూ ఏమీ ఎరగనట్టు తమ పుస్త కాలవంక చూచుకుంటున్నారు. వాళ్ళు కృష్ణమూర్తీ, రామారావూ, వెంకటరమణా అయినట్లు లలిత కప్పుడు తెలిసింది. అందులో ఆమె వెనకాల ఉన్నవాడు రామారావు. అప్పటినుంచీ లలిత ఒక కంట వాళ్లను కనిపెడుతూనే ఉన్నది. కాసేపట్లో వెంకటరమణ–బెంచి మొదట్లో కూర్చున్నవాడు – లేచి ఉమ్మేసుకోడాని కన్నట్లు బైటికెళ్లి పోయాడు. అతను వెళ్లడంతోటే రామారావు పక్కకి జరిగాడు, ఇప్పుడు రామారావు లీల వెనకా, కృష్ణమూర్తి లలిత వెనకాలా అయ్యారు. ఆ తర్వాత రామారావు మాటి మాటికీ కాలు కదిలిస్తూనే ఉన్నాడు. అది లీలకు తగులుతూనే ఉన్నది. ఆమె ఉలిక్కి పడుతూనే ఉన్నది. ఇది గమనిస్తున్న లలిత వెనక్కి తిరిగి ఎన్నిసార్లు గుడ్లురిమి చూచినా లాభం లేక పోయింది. లెక్చరరు తన దారిని తాను పాఠం చెప్పుకు పోతున్నాడే కాని ఈ సంగతు లేమీ గమనించడం లేదు. ఇంతలో లలిత జరుగుతున్న సంగతి తనకు రెండోపక్క నున్న శారదతో మెల్లగా చెప్పింది. ఆమె తన పక్కనున్న

కామేశ్వరితో చెప్తోంది అప్పుడు లెక్చరరు వీళ్లవంక చూచాడు. వీళ్ళు తమతమ పుస్తకాలవంక చూస్తూ తలలు వంచుకున్నారు. లెక్చరరు పాఠం సాగుతూనే ఉంది. అంతలో వంచుకున్న తల ఎత్తుకోవలసినంత బలంగా లీల జడ లాగ బడింది. దాంతో ఆమె అభిమానంతో చచ్చినచావై ఇలా పరుగెత్తుకు వచ్చింది ఈ సంగతి ఇంత స్పష్టంగా చెప్పకో లేదేమో అని లలితకూడా ఆమె వెంబడే వచ్చింది.

అదీ జరిగిన సంగతి!

జాగ్రత్తగా ఈ సంగతంతా విన్న ప్రిన్సిపాలు మనసులో చాలా బాధ పడ్డాడు. ఆమె చెప్పినదాన్ని బట్టి రామా రావు దోషి అని స్పష్టంగా తెలుస్తోంది. అట్లాంటి వ్యక్తి కాలేజిలో ఒక్కడున్నా సరే అది ఆ సంస్థ గౌరవానికే గొడ్డలిపెట్టు. అంతేకాదు. సరళవ్యవహారానికే తీవ్ర ప్రతి బంధకం. ఇంక కాలేజీలో క్రమశిక్షణకే నీళ్ళు వదిలెయ్య వచ్చు. వాణ్ని టి. సి. ఇచ్చి పంపించడమే కాదు, మళ్లీ ఏ విద్యాసంస్థలోనూ చేర్చుకో కూడదని వ్రాసెయ్యాలి.

మనసులో అంత తీవ్రనిశ్చయం చేసుకున్నా ప్రిన్సిపాలు బైటికా భావం ప్రకటించ లేదు.

‘ అయితే ఎవడు చేశాడంటా రీ పని ? ’

‘ ఇంకా అనుమాన మెందుకండీ ? ఆ రామారావే! ’

‘ వాణ్ని గురించి వెనకకూడా ఇల్లాంటి కంప్లెయింట్లున్నాయి కదూ ! ’

'నేనే ఇదివర కొకమాటు తనుతో చెప్పానండీ. మేము ఇంటికి పోతూ ఉంటే వాడు మా వెనకాలే వస్తూ ఉంటా డనీ, ఒక్కొక్కప్పుడు చెకచెకా మా కంటే నాలు గడుగులు ముందుకుపోయి మా దారి కడ్డుగా నడుస్తూ ఉంటా డనీ, మారు పేర్లు పెట్టి పిలుస్తూ ఉంటా డనీ, తన స్నేహితు లందరి తోనూ కలిసి నుంచుని కాలేజిలో మమ్మల్ని చూచి నవ్వు డల్లా ఫుప్పు ఫుప్పున ఉమ్మేస్తూ ఉంటా డనీ చెప్పాం గాని అల్లాంటి వన్నీ పట్టించుకో గూడ దని మీరే మమ్మల్ని కోప్పడ్డా రండి!'

'అవు నవును జ్ఞాపకం ఉంది. వాడే ఇందాకా మితి మీరి పోయా డన్న మాట!'

'అవు నండి. కాస్తా కూస్తానా! మాకు కాలేజికి రావడ మంటేనే భయంగా ఉంటోం దండి.'

'అల్లా భయపడిపోతే ఎల్లా గమ్మా!'

'ఏం చెయ్య మంటారు చెప్పండి? అడుగడుక్కూ అవమానమే అవుతూ ఉంటే ఎన్నాళ్లని తోసేసుకు తిరిగేది? ఊరుకున్న కొద్దీ వాడు రెచ్చిపోతూ ఉండె. అదుపులో పెట్టేవాళ్ళు లేకపోయె. నలుగురితోనూ చెప్పుకుందా మంటే సిగ్గుతో కుమిలిపోవలసివచ్చే విషయ మాయె!'

'మీరు అనవసరంగా బాధపడక హాస్టలుకు వెళ్లండి. నేను వాణ్ని గూడా పిలిచి కనుక్కొని, నలుగురితోనూ సంప్రదించి వెయ్యాల్సిన శిక్ష వేస్తాను. సరేనా!'

'అలా అంటా రని మేము భయపడుతూనే ఉన్నాం. ఇప్పటికే కాలేజి అంతా ఈ సంగతి చెప్పుకుంటూ ఉంటుంది. ఇక నలుగురితోనూ సంప్రదించడం అంటే మమ్మల్ని మరింత అల్లరి చెయ్యడమే కాని మరో ప్రయోజనం ఏమీ ఉండదు. ఆ బాధ మాత్రం తమ కెందుకు? మాకు టీ. సీ. లు ఇచ్చి పంపించెయ్యండి. మే మిద్దరమూ వెళ్ళిపోతాము.'

'అంత ఉద్వేగం పనికిరా దమ్మా. ఏ పనికైనా కాస్త స్తిమితంగా ఆలోచించాలి. వాణ్ని శతవిధాల పంపిం చేస్తాను. ఒకవేళ పడదూ, మీకు టీ. సీ. లు ఇస్తేమాత్రం ఏం చేస్తారు? మరోవూరు పోయయినా చదువుకోవాలి గాని ఈ మాత్రం దానికి మానెయ్యరు గదా! అక్క డయినా ఇల్లాంటి వాళ్ళు ఉండరని నమ్మక మేమిటి? ఈ రోజు లల్లాంటివి. వాటిని బట్టే మనమూ సద్దుకు పోవాలి. అంచేత నా మాట నమ్మి ఇదేమీ జరగ లేదనుకుని మామూలుగా ఉండండి. రెండుమూడు రోజుల్లో వాడి సంగతి నే తేలుస్తాను.'

ప్రిన్సిపాలు ఇల్లా అంటుంటే లలిత కెక్కడలేని ఉద్వేగమూ వచ్చింది. లీల కళ్ళు బాష్ప తటాకపు తూములే అయ్యాయి. ఇక కక్కడ ఉండలేక ఆమె లేచి వెళ్ళిపోయింది. లలితగూడా ప్రిన్సిపాలు దగ్గర లాంఛనంగా సెలవు తీసుకుని ఆమె వెంట వెళ్ళింది.

8

లీల ఆ సాయంత్రం భోజనం చెయ్యలేదు. రాత్రి నిద్ర పోలేదు. ఏడ్చి ఏడ్చి ఉబ్బిన ఆమె కళ్లు తెల్లవారే సరికి నీటి చుక్క లేకుండా ఇగుర్చుకు పోయి ఎండిన వరుగుల్లా వాడి వత్తు లయ్యాయి. కారిన కన్నీళ్ళు ముఖాన చారికలు కట్టి, ఎర్రమట్టి తోనూ సుద్దతోనూ పెట్టిన చారలతో కలకలలాడే పల్లెటూరి పాతకాలపుటింటి ప్రహారీగోడ, వాన వచ్చి కడుక్కుని పోగా, వెలవెలబారిన ట్టయింది. ఆ ముఖంతో, ఆ కళ్లతో పొద్దున్న లేచింది లేచినట్లు వెళ్లి కుర్చీలో కూర్చుని, అరచేతుల్లో ముఖం పెట్టుకుని, మోచేతులు బల్లమీద ఆన్చి, ఎదురుగా ఉన్న తెల్లగోడవంక శూన్య దృక్కులు ప్రసరిస్తూ అలా ఉండిపోయింది లీల.

లలిత వచ్చి బతిమాలింది, బుజ్జగించింది, ధైర్యం చెప్పింది. అయినా లీల తేరుకో లేదు. ఆమె మనస్సు అంతకలుషితమై పోయింది. ఆ మనోజలం తేరుకోవా లంటే ప్రతీకార కతకగంధం కావాలి. అంత వరకూ ఆమెకు శాంతి లేదు.

తొమ్మి దయింది. హాస్టలులో విద్యార్థిను లందరూ భోజనాలకు వెళ్తున్నారు. లలిత వచ్చి లీలను రమ్మన్నది.

కాని లీల కదలలేదు. పైగా లలితను వెళ్ళిపొమ్మన్నది. నెచ్చెలి స్వభావం తెలిసిన లలిత వెళ్ళక తప్పింది కాదు.

తర్వాత వత్సలమ్మగారు కూడా వచ్చారు. ఆవిడ ఆడపిల్లల హాస్టలుకు డిప్యూటీ లేడీవార్డెను. జరిగిన సంగతంతా నిన్న సాయంకాలానికే తెలిసినా ఈ పిల్లలు వచ్చి తనతో చెప్పకోకముందే తాను వెళ్ళి వాళ్ళను పలకరించడం భావ్యం కాదన్న మిథ్యాగౌరవభావంతో ఆవిడ రాత్రంతా ఊరికేనే ఉండిపోయింది. కాని లీల రాత్రి భోజనం చెయ్యలేదనీ, ఈ పూట కూడా భోజనానికి రానన్నదనీ తెలిసేసరికి కీడెంచి మేలెంచమని ఇది మరేవిధంగానైనా పరిణమిస్తే తన బాధ్యత తాను నిర్వహించలేదన్న దోషం బైటపడుతుందేమో అనే భయంతో ఇప్పటికీ లీలగాని, లలితగాని తనతో వచ్చి చెప్పకపోయినా తానే లీల దగ్గరకు వెళ్ళింది. లీలాలలితల కావిడతో చెప్పకోగూడదనే భావం ఏ కోశానా లేదు. అసలు సంఘటన జరిగినప్పుడు ఆ ఉద్వేగంలో లీలకు ఆవిడ విషయం జ్ఞాపకమే రాలేదు. ఆవిడతో చెప్పినా ఆమె వెళ్ళి ప్రిన్సిపాలుతో చెప్పవలసిందే కాబట్టి ఈ దశాక్రమం తోచకపోయినా, తానే ప్రిన్సిపాలు దగ్గరకు వెళ్ళిపోయింది. ఆమె వెనక వెళ్ళిన లలితకు ఈవిడతో చెప్పడం మంచిదే, కాదు అవసరం కూడా అని స్ఫురించి నప్పటికీ అప్పుడామె మరో క్లాసులో పాఠం చెప్తూ ఉండడం చేత వీలు కాలేదు. ప్రిన్సిపాలుతో మాట్లాడడం, వాళ్ళ మనసులిన్ని మరింత పాడు

చేసింది. ఆ వెంటనే వాళ్ళు హాస్టలుకు వెళ్ళిపోయారు. తర్వాత లీలను ఓదార్చడం తోనే లలితకు సరిపోయింది. రాత్రి తెల్లవార్లూ వాళ్ళకు నిద్రలే లేవాయ్. ఇంక చెప్ప డానికి వ్యవధి ఏదీ?

ఏమయితే నేం, ఆవిడ లీలను పలకరించి, జరిగిన దానికి విచారం ప్రకటించి, అయూచితంగా తన సహాయాన్ని వాగ్దానం చేసి దుఃఖపడ వద్దనీ, ఇలా అన్నం మాని కూర్చోవడం మంచిది కా దనీ ఎంతెంతో చెప్పింది. హృదయం కలిసిన స్నేహితురాలు లలిత చెప్పితేనే వినని లీల కేవలం విధి నిర్వహణం కోసం ఆవిడ చెప్పి నంతమాత్రంతో ఏమి వింటుంది? చివరకు లాభం లేక తన విధి తాను నిర్వర్తించా నన్న తృప్తితో ఆమె వెళ్ళిపోయింది.

లీల మాత్రం అల్లాగే కూర్చుని తన మనస్సును తవ్వుకుని తవ్వుకుని దుఃఖాన్ని తిరగ దోడుకున్నది.

ఆమె ఏమంత అందగత్తె కాదు. పైగా నల్లగా ఉంటుంది. కాని ఆమె కళ్ళల్లో వెన్నెల వెలుగు లున్నా యని లలిత అంటుంది. ఆ వెలుగులే తన బావకు తా నంత ప్రియతమ కానడానికి హేతు వేమో! మదరాసులో డాక్టరు పరీక్షకు చదువుతున్నాడు. ఈ సంగతి అతనికి తెలిస్తే ఏ మనుకుంటాడో? అమాంతం వచ్చి ఆ వెధవని నాశనం చేస్తా డంటుంది లలిత. కాని అతనికి అసలు సంగతి

తెలుస్తుందా! లోకం నోట్లో పడి తారు మారై అసహ్యంగా వినిపిస్తుంది. దాంతో అతనికి కోపం వస్తుంది. తన ఆశలూ, ఎంతెంతో కష్టపడి డబ్బు పంపిస్తున్న తండ్రి ఆశలూ మూల ముట్టుగా తెగిపోతాయి. తానే ఈ సంగతి వ్రాసుకుంటే! ఏమని వ్రాయడం? చేతు లెల్లా వస్తాయి? అయినా, ఏదో గాలి పుకారు వస్తే నమ్మేవాడు తాను వ్రాసుకున్నంత మాత్రంతో ఆ పుకార్లు తోసేస్తాడని నమ్మక మేమిటి? తన బావ అస లల్లాంటి మాటలు నమ్మనే నమ్మడు. అతనికి తా నంటే అంత విశ్వాసం, అంత ప్రేమ. ఈ ఊరు వచ్చి, ఇన్ని కష్టాలు పడుతూ, ఇన్ని అవమానాలూ భరిస్తూ ఈ చదు వంతా చదువుతున్నది దేనికి? సాధ్యమైనంత వరకూ అతనికి తగిన భార్య కావాలనే కదా! పరమ పవిత్రమైన ఈ ప్రయత్న పథంలో ప్రీ డొకడు భూతంలా పట్టుకుని వెనక్కి లాగుతున్నాడు. ఊరుకున్న కొద్దీ భూతానికి లొంగిపోవడమే కాని దాన్ని జయించడం పడదు. అంతే కాదు. తక్కిన రూపు కట్టని భూతాలు గూడా రెచ్చిపోయి బ్రహ్మరాక్షసు లవుతాయి. ఇల్లా పడి ఉండడం వల్ల మరే ప్రయోజనమూ ఉండదు. ఎదురు తిరగాలి. దెబ్బ తియ్యాలి. ఎంతటి భూత మైనా దెబ్బకు జడిసితీరుతుంది. కాకపోతే తల్లీ, తండ్రీ, అయినవాళ్లూ దగ్గర లేరు కదా అని కాలేజిలో అడుగు పెట్టిన ప్రతి చవటకూ ఆడపిల్ల లంటే ఇంత చులకనతనమా? కది లితే హేళన, మెదిలితే అపహాస్యం! ఆ జడ వేసింది, ఈ చీర

కట్టింది, అల్లా కూర్చుంది, ఇల్లా నుంచుంది అంటూ ప్రతి పిల్లను గూర్చి వ్యాఖ్యానా లేనాయ్! ఎన్ని పుతాలు వేసినా ఎంతమాత్రమూ మారని ఎలుగ్గొడ్డు ముఖాలూ, కోతి ముఖాలూ వేసుకున్న ప్రతి కుర్రాడూ మా అందాలను చూచి ఎగతాళి చెయ్యడమేనాయ్! కాలేజిలో అడుగు పెడితేసరి మరో మాటే వినిపించదు. నల్లగా ఉంటే గాస్‌లైటు, పౌడర్ వేసుకుంటే డబుల్‌కోటింగు, చకచకా నడిస్తే చలాకీ గుర్రం, తల వంచితే వంతెన, ఎత్తితే ఎక్స్ట్రా. పోనీ అనుకుంటే అనుకున్నారు, మన మేం చెయ్యగల మని చెవులు మూసుకుని ఊరుకుంటే వీటి నన్నింటినీ గోడల మీది కెక్కించి వాటి పక్కన అసలు పేర్లు వ్రాయడమాయ్. అంతటితో ఆగినా ఎల్లాగో భరించ వచ్చు. అదంతా వ్యక్తిగత మని ఊరుకుంటాం. కాని ఇ దేమిటి! బాగా చదివే కుర్రాడితో మాట్లాడితే వాడితో స్నేహం, మంచి మార్కులు తెచ్చుకుంటే ఇచ్చిన మాష్టరుతో స్నేహం! ఛీ, ఛీ, ఛీ! స్త్రీకి ఇంతకన్నా దుర్భరావమానం ఇం కే ముంటుంది? మానంగల యువతి ఈ పరిస్థితుల్లో కాలేజీలకు వచ్చి ఏం చదువుకుంటుంది? దీని కెక్కడైనా అంతంటూ ఉన్నదా! వచ్చిన జాతిలో పుచ్చుపురుగులు పుట్టి అసలే అంతంతగా ఉన్న హద్దుగోడల్ని చెదలు తిన్నట్లు తింటున్నాయి. మీారి మీారి ఆ పురుగులు గోడల్ని దాటేస్తున్నాయి. పురుగును పురుగుగానే చూడాలి గాని పురుషుణ్ణిగా చూడ కూడదు.

లలిత అప్పుడే భోజనం చేసి వచ్చి 'నేను కాలేజికి వెళ్తున్నాను లీలా!' అన్నది.

చటుక్కున మెలకువ వచ్చినట్లు లేచి 'నేనూ వస్తున్నా' నంటూ లీలకూడా అల్లాగే బయలుదేరింది.

౪

ఆ పూట కాలేజి అధికార సంఘము వారు నిన్న మధ్యాహ్నం జరిగిన సంఘటనను గూర్చి ఆ సాయంత్రమే ఆరంభించిన తర్జనభర్జనలను కొనసాగిస్తున్నారు. ఆ సంఘంలో ప్రిన్సిపాలూ, వత్సలమ్మగారూ కాక ఇంకా అయిదుగురు సభ్యులున్నారు. వాళ్ళల్లో ముగ్గురు తమ అనుభవాన్ని బట్టి రామారావు వస్తుతః అంత చెడ్డవాడు కాదని వాదిస్తు న్నారు. ''ఒకప్పుడు మంచివాడే కావచ్చు. ఆ మాట నేనూ కాదనను. అయినా ఇప్పుడీ పని చేశాడు. అంచేత, ఈ దుష్టత తాత్కాలికమే అయినా దీనికి తగిన శిక్ష వెయ్యక పోతే కాలేజీ పాడై పోతుంది.'' అని ఒకాయన అంటున్నాడు. ''రామారావు మొదటినుంచీ దుర్మార్గుడే. చిన్నప్పటినుంచీ వాడి సంగతి నాకు తెలుసు. చేర్చుకునే టప్పుడే వాణ్ణి వద్దండీ అని నేను చెప్పాను. అయినా అప్పటి ప్రిన్సిపాలు నా మాట కాదని పట్టి కులాభిమానంతో చేర్చుకున్నాడు.

నేనే ప్రిన్సిపాలు నయితే వాణ్ని ఈ కాలేజీలోకి రానిచ్చే వాణ్నే కాదు.' అంటున్నాడు మిగిలిన పెద్దమనిషి. ఫలితం ఏమయినా తన కేమీ ఇబ్బంది లేనట్టు మేర్యానికి ప్రిన్సిపాలుకు తానుగూడా ఫిర్యాదు మాత్రం ఇచ్చి ముభావంగా కూర్చున్నది వత్సలమ్మ.

ఆడపిల్లల తరఫున వాదించవలసిన ఆవిడ అల్లా ఉండి, తక్కిన నలుగురూ నాలుగు విధాలా అంటూంటే ఏం చెయ్యాలో తోచక ప్రిన్సిపాలు బాధపడుతున్నాడు. తోడి పెద్దఉద్యోగులు ముగ్గుర్ని వ్యతిరేకించి వ్యవహరించడం అంత భావ్యం కాదు. అల్లా అని అంత దుష్టంగా ప్రవర్తించిన వాణ్ని ఏమీ చెయ్యకుండా ఊరుకోవడానికీ మనస్కరించడం లేదు. సంఘంలో ఉన్నవాళ్ళందరూ అయిన పని చాలా చెడ్డ దని ఏకీభవిస్తూనే ఉన్నారు. కాని రామారావును శిక్షించడం దగ్గర మాత్రం ముగ్గురు కూడిరావడం లేదు. అందరూ ఒక అభిప్రాయంతో ఉంటే ఆయన పని తేలికయి పోయేది. కాని అది సృష్టిలోనే అసంభవం.

అంతలో రామారావును శిక్షించకూడద నే వాళ్ళల్లో ఒకరు బైటికి వెళ్ళి, అతని తండ్రితో మాట్లాడి, లోపలికి వచ్చి, ఒక విచిత్ర ప్రశ్న వేశారు. దాంతో అసలు ఘట్టమే మొదటికి వచ్చింది. రామారావు సోమవారం రాలేదు. ఇవ్వాళ బుధవారంగూడా రాలేదు. మధ్య మంగళవారం కాలేజీ కసలు వచ్చాడా? ఇదీ ఆయన వేసిన ప్రశ్న.

ఈ ప్రశ్న విని శిక్షించా లనే వాళ్ళిద్దరూ నిర్ఘాంత పోయారు. ఆ నాడు వాళ్ళిద్దరి క్లాసుల్లోనూ అత నున్నాడు. వాళ్ళు తమ కళ్లతో తాము చూశారు. తమ పుస్తకాల్లో అతని నెంబరు ఆబ్సెంటుగా వేసుకోలేదు. ఈ మాటే గట్టిగా చెప్పారు వాళ్ళు.

కొత్త ప్రశ్న వేసినాయన తొందరలో ఈ సంగతి ఊహించలేదు. తన పుస్తకంలో వాడి నంబరు వేసుకుంటే సరిపోతుందిగదా అనుకున్నాడు. ఇప్పు డద్దం తిరిగి తనదే పొరపా టని తేలే స్థితి వచ్చింది. పచ్చివెలక్కాయ గొంతు కడ్డు పడ్డ ట్టయి 'నా క్లాసులో లేదు కాబట్టి కాలేజీకే రాలే దనుకున్నాను. వచ్చినా, రాకపోయినా జరిగినదానికి వాడేం చెప్తాడో మన మింతవరకూ తెలుసుకో లేదు. పెద్దపెద్ద కేసు ల్లోనే ముద్దాయి వాఙ్మూలం తీసుకోకుండా శిక్షగూర్చి ఆలో చించరు. అందుచేత వాడు వచ్చేవరకూ మన మే నిశ్చ యమూ చెయ్యకూడదు' అని ఆయన ఎంతో నైపుణ్యంతో ప్రతిపాదించాడు. ప్రిన్సిపాలు దాన్ని కాదనడానికి వీలులేక పోయింది. అంచేత ఆ నాటి కంతటితో సభ అయిపోయింది.

నిజానికి రామారావు ఆనాడు కాలేజీలో తిరుగుతూనే ఉన్నాడు గాని కాలేజీకిమాత్రం రానట్టే లెక్క. ఎంచేతంటే అతను క్లాసులకు వెళ్ళడమే లేదు. అంచేతనే ప్రిన్సిపాలు పంపిన కబురు అతని కందడం లేదు. ఆయనకు కనబడకుండా, తన్ను శిక్షించాలని యత్నిస్తున్న అధికార సంఘ సభ్యుల

కంట బడకుండా అతను కాలేజీ వరండా లన్నింట్లో తిర
గుతూ 'ఏం చేస్తాగో చూస్తా' మంటున్నట్లు స్వప్రతాపం
ప్రకటించుకుంటున్నాడు. అతన్ని చూచి ఇంచుమించు కుర్రా
ళ్ళందరూ పరదేశ ప్రభుత్వాన్ని ధిక్కరించి సత్యాగ్రహాలూ,
శాసనోల్లంఘనాలూ చేసి చేయించిన జాతీయవీరుల కంటె
తమలో గొప్పవాణ్నిగా భావించుకుంటున్నారు.

ఆడపిల్లల గదిలో లీల - అసలే సుకుమారమైన ప్రాణి,
రెండు పూటల నుంచీ అన్నం తినకపోవడంవల్ల శరీరం అవ
శమై యున్నా అవకాశం కోసం వెయ్యికళ్లతో నిరీక్షిస్తూ
కూర్చుంది.

కాని రామారావు ఆ రోజల్లా ఆ వైపే పోలేదు.

## ౨౪

మర్నాడుకూడా లీల పట్టినపట్టు విడవకుండా నిరా
హారగానే కాలేజీకి వెళ్లింది. అధికార సంఘం అతన్ని
శిక్షించి పంపించి వేస్తుందా, సరేసరి. లేదూ, తానే అతన్ని
శిక్షిస్తుంది! అవసరమయితే తానుగూడా కాలేజి మాని
వేస్తుంది. అదీ ఆమె పట్టు! తెలిస్తే కథ అంతటితో పాటు
ఆమె బావకీ సంగతి కూడా తెలియాలి. అదీ ఆమె ఆశయం!

ఆ నాడు రామారావు కాలేజికి వచ్చాడు. ప్రిన్సిపాలు
కబురు పంపిస్తే అతను నిర్భయంగా పై అధికారి కెదురి

ఉద్యోగస్థుణ్ని తనిఖీ చెయ్యడానికి వెళ్ళినట్లు వెళ్లాడు. అతను చేస్తున్న కొంటె చేష్టలన్నీ తమ చదువులకు ఆటంకం కలిగిస్తున్నా యని భావించే విద్యార్థులు కొందరున్నా వాళ్ల సంఖ్య గణనలోకి రాదు కాబట్టి కాలేజి అంతా రామా రావు అఖండవిజయాన్ని ఆశిస్తూ మహోత్కంఠతో ఎదురు చూస్తోందనే చెప్పాలి.

రామారావునీ, అతని బలగాన్నీ ఆ నాడు ప్రిన్సిపాలు ప్రత్యక్షంగా చూచాడు.

'ఏమయ్యా!' అని సంబోధించక తప్పిందికాదు ఆయనకి.

'ఇది గో కంప్లెయింటు! చేసింది నిజమేనా?' అన్నాడు ప్రిన్సిపాలు ఆ జాగ్రత్తతోనే.

అతను రెండు నిమిషాలు దానివంకచూచి 'రామ రామ! నే నా పూట కాలేజికే రాలేదండి!' అన్నాడు.

'మరి వీ ళ్ళిద్దరూ వచ్చినట్టు చెప్తున్నారే!'

'వాళ్ళ క్లాసులు ఉదయం అండి. నేను రాంది మధ్యాహ్నం మండి.'

అప్పుడు మంగళవారం మధ్యాహ్నం మొదటి గంట ఇంటర్మీడియేటు మూడో గ్రూపు తరగతికి ఇంగ్లీషు పాఠం చెప్పిన మాష్టారి రిజిష్టరు వచ్చి అతను రానట్లు సాక్ష్యం చెప్పింది. ఇందులో ఆ మాష్టరు లోటుపాటు ఏమీ లేదు. రామారావు ఆ క్లాసులో ఉన్నా తానుహాజరు చెప్పలేదు,

తన వాళ్ళను చెప్పనియ్య లేదు. ఆ ఇంగ్లీషు మాష్టరు ఇతని ముఖం గుర్తించి ఫలానా అని చెప్పగలిగే టంత పాతవాడు కాదు. అంచేతే ఆ క్లాసులో అల్లాచేస్తే తన సరదా తీరుతుం దని అతను పథకం వేసుకున్నాడు. ఆ పథకం అనుకున్నట్టు అక్షరాలా నెరవేరింది. ఇక అతన్ని ఎంతమంది ఏకమై మాత్రం ఏం చెయ్యగలరు ?

రామారావు విజయవార్త క్షణాలమీద కాలేజి అంతా పాకిపోయింది. ఆ వార్త వెళ్ళివెళ్ళి ఆడపిల్లల గదిలో అశనిపాతంలా పడింది. కాని పొదలా ఉన్న అందులోనుంచి తోకతొక్కిన ఆడుతాచులా, తన్ను పట్టుకుంటున్న లలితను కూడా తప్పించుకుని లీల చర్రున దూసుకువచ్చింది.

ఏ అఘాయిత్యం చేస్తుందో అని లలిత ఆమె వెంబడే పరిగెత్తింది. ఆ దారిలో దుష్ట మండూకం పడలేదు గాని పడితే కాటు పడేదే !

లీల సరాసరి ప్రిన్సిపాలు గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె నిలబడలేకపోతోంది. లలిత పక్కకువెళ్లి ఆమెను పట్టుకొన్నది.

'ఏం చేశారు ?' అన్నది లీల.

ఆ గొంతులో తన సంఘాని కంతటికీ జరిగిన అవమానానికి ఆమె పడుతున్న ఆవేదన, విడిచిన నిట్టూర్పులతో కలిసి వెచ్చగా ధ్వనించింది.

ప్రిన్సిపాలు ఆమెలో తీవ్రతను చూచి తప్పు చేసిన వాడిలా బెంబేలు పడిపోయాడు.

లీల తన్నుతాను నిలద్రొక్కుకుని 'నేను టీ. సీ. అడగడానికి రాలేదు. అడగదలచుకోలేదు కూడా! కాని మీరు విడిచి పెట్టేసిన ఆ ద్రోహిని నేనే శిక్షిస్తాను...' అని బలహీనపు కంఠంతో, పట్టరాని ఆవేశంతో అనబోతోంది.

అంతలో లలిత 'లీలా!' అంటూ ఆమెను తన రెండు చేతులతోనూ పట్టుకుని బలవంతాన గుమ్మంవైపు దారి తీసింది. కాని వెళ్తూవెళ్తూ లీల, 'నాకు శిక్షగా మీరే ఇద్దురుగాని టీ.సీ. అది చేతనవుతుందిగా!' అన్న మాటలు ప్రిన్సిపాలు చెవులకు శూలాల్లా తగిలాయి.

౬

ఆ సాయంత్రం కాలేజి సభాభవనంలో ఆంధ్ర సారస్వత సంఘం యాజమాన్యాన 'స్త్రీ స్వాతంత్ర్యం అవసరము' అన్న విషయాన్ని గూర్చి కుర్రాళ్ళల్లో అతిరథ మహారథు లందరూ చర్చ సలపడానికి సమావేశ మయ్యారు.

సభమాట జ్ఞాపకం ఉన్నా, జరిగిన పరాభవాన్ని భరించలేక నీరసంగా ఉన్న లీలను తీసుకుని హాస్టలుకు వెళ్లిపోవాలని లలిత ప్రయత్నిస్తే 'నువ్వు మాట్లాడాలి. సభ

అయ్యేదాకా నే నుండాలి' అని లీలే మొండిపట్టు పట్టింది. ఆమె మనస్సులో ఏ ఉద్దేశం ఉందో తెలియదు గాని ఆమె పట్టు ఫలితంగా, స్త్రీల స్వాతంత్ర్యాన్ని గూర్చి అంతమంది పురుషవరేణ్యులు చర్చించబోతున్న ఆ సభలో, వాళ్లిద్దరైనా స్త్రీ లుండడం తటస్థించింది.

సాధారణంగా కాలేజీల్లో విద్యార్థు లేర్పాటు చేసే వైజ్ఞానిక సభలకు కుర్రాళ్లే ఆట్టేమంది రారు. కాని ఆ నాడు చాలా మంది వచ్చారు. దానికి రెండు మూడు కారణా లున్నాయి. పోటీల్లో రామారావు విజయాన్ని కూడా పేర్కో వచ్చు. తమ నాయకుడు గెల్చాడు; అతని పక్షం వాళ్లిందులో అనేకులు పాల్గొంటున్నారు. అందుచేత ఆ సభ ఒక విధంగా వాళ్లదే అయింది. అంతేకాదు. నాయకుడి తర్వాత నాయకు డంతటి వాడు అధ్యక్షత వహిస్తున్నాడు, ఇదొక హేతువు. తర్వాత బలవత్తరమైన హేతువు ఆ నాటి చర్చనీయాంశం. అందులో తమాషా చెయ్యడానికి గాని, కులాసా అనుభవించ డానికి గాని ఎంతైనా అవకాశం ఉంది. వీటన్నింటి కంటే ముఖ్యమైంది మరొకటుంది. అది ఆ నాటి సభలో మాట్లాడ డానికి లలిత ఒప్పుకోవడం.

ఏమయితే నేం, ఇంచుమించు కాలేజి అంతా ఆ నాటి సభలో ఉన్నట్టే అయింది.

సభా ప్రారంభ సమయం సన్నిహితమైనా, అనివార్య కారణాల వల్ల ఆహ్వానితులైన అధ్యక్షులు రాలేదు. వారు

రా రన్న సంగతి నిర్వాహకులకు మధ్యాహ్నమే తెలిసింది. ఆ స్థానం ఆక్రమించ వలసిన వ్యక్తిని గూర్చి ఇంతకు ముందే వాళ్లు నిర్ణయించు కున్నారు గూడా. ఆ సంగతి ఆడ పిల్లలకు తెలియదు గాని తక్కిన కాలేజి అంతటికీ తెలుసు.

అనుకున్న వేళయి అరగంట గడిచాక కార్యదర్శి లేచి కావలసిన అధ్యక్షులు రాలేదనీ, అందుచేత కృష్ణ మూర్తిగారి నా స్థానం స్వీకరించవలసిం దని కోరుతున్నా ననీ సభాముఖంలో అన్నాడు. ఈ అధ్యక్షవరణం కుర్రాళ్ళకు పరమ హర్షాన్ని కలిగిస్తే అక్కడున్న లీలా లలితలకు క్షణ కాలం తీవ్ర బాధ కలిగించింది. మొన్న జరిగిన సంఘటనలో ఈ వ్యక్తి సహకారం గూడా ఉన్నది. అంచేత లలిత ఆ మాట వినడం తోటే 'మనం వెళ్లి పోదా మన్నది లీలతో. కాని ఆమె 'ఏమైనా సరే ఉందాం! వాళ్లు మీరి వస్తే మనం తెగిద్దాం' అని పట్టు పట్టుకు కూర్చుంది.

కృష్ణమూర్తి అధ్యక్షాసనం అలంకరించాడు. సభలో కరతాళ ధ్వనులు చెత్తరేగి పోయాయి.

అధ్యక్షులు, తమ భావం చర్చానంతరం చెప్పడం భావ్యం కాబట్టి చివరకు చెప్తా మని వాగ్దానం చేసి, సభను ప్రారంభించ మని నరసింహాన్ని కోరాడు.

అతను కుర్రాళ్ళకు ప్రేమ పాత్రుడైన మరో నాయకుడు. అందుచేత అతను మాట్లాడినంత సేపూ మెప్పుదల సూచిస్తూ చప్పట్లు కొట్టి చప్పుడు చేస్తున్నా సభ నిశ్శబ్దంగానే ఉంది.

ముందు వరసలోనే లలిత పక్కన కూర్చున్న లీల చక్షుశ్ర్శవమై అన్ని వైపులా, ప్రతి మూలా చూస్తూనే వింటోంది.

'మన దేశంలో మన పూర్వులు స్త్రీలకు స్వాతంత్ర్యం లేకుండా చేసి వాళ్లను కేవలం వంటయింటి బానిసలుగా ఉపయోగించుకున్నారు. అంతకంటే అన్యాయం మానవజాతి చరిత్రలోనే మరొకటి కనిపించదు. ఈ రోజుల్లో విద్యార్థులమైన మనం - అంటే భావిభారతపౌరుల మన్న మాట - అలాంటి పాత ఉసిరికాయ భావాలు పెంచుకుంటే ఎందుకూ పనికి రాం. మనదేశం బాగుపడా లంటే, స్త్రీలకు స్వాతంత్ర్యం ఉండాలి. స్త్రీ అంటే ఎవరు? మీరూ, నేనూ, ఇక్కడ ఉండే యావన్మందీ స్త్రీ దయ వల్లనే ఆవిర్భవించారు. అల్లాంటి ఆదిశక్తికి స్వాతంత్ర్యం అక్కర్లేకపోవడ మేమిటి? వద్దంటే మాత్రం మానుతుందా? స్త్రీలకే స్వాతంత్ర్యం లేకపోతే మన కాలేజిలాంటి కాలేజీలకు అందం ఏముంది, ఆనందం ఏముంది? అంచేత స్త్రీలకు స్వాతంత్ర్యం ఉండి తీరాలి!' నరసింహం ఉపన్యాసం ఇల్లా సాగి పోతోంది. పోను పోను హర్షధ్వానాలు ఎక్కువై పోయి ఆ తర్వాతి భాగం ఉటంకించడానికి వీలుకాకుండా చేశాయి.

అతని తరువాత మరి నలుగురు పురుషులు మాట్లాడారు. వాళ్లల్లో ఇద్దరు తీర్మానానికి వ్యతిరేకంగా మాట్లాడాలని ప్రయత్నించారు గాని చేతకాక మొత్తానికి తాత్పర్యంలో అనుకూలతనే ప్రకటించారు.

చిట్ట చివరికి లలిత వంతు వచ్చింది. ఆమె వేదిక దగ్గరకు వెళ్తున్నంత సేపూ సభికుల మనసుల్లో ఏ భావం ఉన్నదో తెలియదు గాని వట్టి చేతుల చప్పట్లు కాక బల్లల మీద ధ్వనులు ఆమె అడుగులతో లయ కలిపి చిత్రమైన చర్మ దారు వాద్యం సాగించాయి. ఆ వాద్య ధ్వనిలో కలిసి పోయి స్పష్టాస్పష్టంగా 'ఎమజాక్, స్టడీ, నాయకురాలు - ఉపన్యాసకురాలు' ఇత్యాది వందిగణ పాఠాలు కూడా విని పించాయి. ఆమె వీటి నన్నింటినీ లక్ష్యం చెయ్యక ధైర్యంగా వేదిక మీదికి వెళ్లి ఒక్కసారి సభ వంక చూచే సరికి మొదట్లో ఆది మానవ చేష్టా విశేషాలు కనిపించినా తర్వాత తర్వాత 'ఏమిటి మీ రిచ్చే స్వాతంత్ర్యం? సగౌరవంగా స్త్రీని చూడలేని చచ్చు యువకులు స్వాతంత్ర్యం ఇస్తారుట!' అంటూ మహావేశంతో అందుకోగానే కల్మష హృదయాలు చిల్లులు పడుతున్నా ఆమె వ్యథిత హృదయంలో నుంచి లావాద్రవంలా వచ్చి దూకుతున్న ఉపన్యాస ప్రవాహంలో పడి ఏమీ చెయ్యలేక సభ స్తబ్ధమై పోయింది.

లలిత మొదలుపెట్టే వరకూ ఆ ప్రదేశం అణువణువూ చూస్తూ వింటున్న లీల అప్పటి నుంచీ వింటూ చూడ్డం మొదలు పెట్టింది.

ఆ పూట లలిత అయిదు నిమిషాలే మాట్లాడింది. అయినా సభ అట్టుడికినట్టుడికింది. చాలామందికి ఆమె నక్కడే హతమార్చెయ్యాలన్నంత కోపం కూడా వచ్చింది.

కాని లీలా లలితలు సభకు వెళ్తున్నా రన్న సంగతి తెలిసి ఈ పూట మ రేమైనా జరుగుతుం దేమో అని భయపడి సభ లో కూర్చోక పోయినా కాలేజిలోనే ఉండి ప్రిన్సిపాలు ఇద్దరు ముగ్గురు లెక్చరర్లతో చుట్టు పక్కల తిరుగుతూనే ఉండడం ఏం చెయ్యడానికీ వీ ల్లేకుండా వాళ్ల కోపాన్ని అణిచి వేసింది.

అప్పటికే కాలా తీతమైంది. అధ్యక్షులు తమ వాగ్దా నాన్ని ఉపసంహరించుకుని తీర్మానం ఓటుకు పెట్టారు. స్త్రీ స్వాతంత్ర్యం కావా లన్నవాళ్ళు చేతు లెత్తా లనడంతో ఆ సభలో ఇద్దరు తప్ప తక్కిన వా ళ్లందరూ వ్యతిరేకంగా మాట్లాడిన లలిత మీంది కోపంతో ఉన్న చేతు లన్నీ ఎత్తారు.

తీర్మానం గెలిచింది. సభ అయిపోయింది.

ఆచరణలో పరాభవం పొందిన లీల ప్రతీకార దృష్టితో చూచి చూచి విసుగెత్తి చిట్టచివరి క్షణాల్లో తనకు తెలియకుండానే నీరసం చేత బల్ల మీంద వాలి కన్ను మూసింది.

లలిత ఆమెను మెల్లగా తట్టింది. ఆమె ఉలిక్కిపడి లేచింది, కా_స్త ఉంటే లలితను కొట్టేసేదే! కాని ఆమె కంఠ ధ్వనిని విని 'నువ్వా?' అన్నది లీల. 'నేనే' అంటూ లలిత ఆమెను దగ్గరకు తీసుకుని హాస్టలు వైపు దారి తీసింది.

సభకు వచ్చిన కుర్రా ళ్లందరూ లలితను గూర్చి నా నా మాటాలూ అనుకుంటూ ఆ దారిలోనే ముందు వెళ్తు

న్నారు. చాలా వెనక ఉన్న లీలా లలితలకు ఆ మాటలు వినిపించడం లేదు.

దారి పొడుగూతా ఎలెక్ట్రిక్ దీపాలు ఉన్నా మధ్య మధ్య స్తంభాలకు బల్బులు లేక చీకటి పట్టులు తరుచూ వస్తున్నాయి. అలాంటి చోట్లల్లో కూడా లీల కళ్ళల్లోని క్రోధాగ్ని స్ఫులింగాలతో ఎదుట బడ్డ వస్తువులు కనిపిస్తూనే ఉన్నాయి.

కాలేజి దాటి వాళ్ళింకా ఫర్లాంగైనా పోలేదు. మరో ఫర్లాంగు పోతేగాని హాస్టలు రాదు.

అంతలో ఎవరో సిగరెట్టు వెలుగులో ముఖాన్ని చూపించి చటుక్కున చీకట్లో మాయమయ్యారు. ఆ చీకటి పట్టు తక్కినవాటి కంటే కొంచెం పెద్దది. ఒకరి మీద ఒకరు చేతులు వేసుకుని లీలా లలితలు ఆ పట్టున మెల్లగా నడుస్తున్నారు.

చీకటి పోయి మళ్ళీ వెలుగు వచ్చింది. కాని వెన కాల ఏదో కాళ్ళ చప్పుడు వినిపించి లీల గిరుక్కున తిరిగింది. ఎదురుగా రామారావు!

అతి సాహసంతో వాళ్ళ దగ్గరకే అడుగులు వేస్తు న్నాడు. ఇందాకా ముందువైపున చీకట్లో కనిపించి మాయ మైందికూడా అతనే! తాను చేసిన పనికి ప్రిన్సిపాలంతటి వాడు పట్టుపట్టికూడా శిక్ష వెయ్యలేక పోవడం అతని కెక్కడ

లేని మత్తునూ కలిగించింది. ఆ మత్తులోనే అతను హాయిగా ఆరింటికే భోజనంచేసి, అరగంట సేపు నీటుగా వేషం వేసుకుని, బజారులోకి వచ్చి ఘుమాయించి సువాసనకొట్టే మంచి కిళ్ళీ ఒకటి కులాసాగా వేసుకుని, దర్జాగా సిగరెట్టు కాలుస్తూ సరదాకోసం కాలేజి హాస్టలు దగ్గరకు వెళ్ళాడు. ఇంకా మీటింగు కాలేదనీ, కుర్రాళ్ళు రాలేదనీ అక్కడికి వెళ్లాక అతనికి తెలిసింది. అల్లా గయితే కాలేజికే వెళ్దామని బయలుదేరాడు. దారిలో సభనుంచి వస్తున్న కుర్రాళ్ళు కనిపించారు. వాళ్ళు చెప్పిన వేవీ అతని బుర్ర కెక్కలేదు గాని రెండు సంగతులు మాత్రం తెలిశాయి. తక్కిన ఆడపిల్ల లెవ్వరూ సభకు రాలేదు. వత్సలమ్మ తోడులేకుండానే లీలా, లలితా వెనకాల వస్తున్నారు. ఇం కేం కావాలి? అతని మనస్సు ఆనంద సముద్రమే అయిపోయింది. ఏ సముద్రానికైనా ఉప్పెన తప్పదు. స్వాదుత్వంలేని ఆ జలం అసాధువై చెలియలికట్టను దాటుతుంది. అందుకనే రామారావు ముందుకు పోయాడు. చీకట్లో మెల్లగా తప్పుకుని వాళ్ళ వెనక పడ్డాడు.

లీల గిరుక్కున తిరిగి రామారావును చూచి అర నిమిషమయినా కాలేదు. ఆమె ఛర్రున వెళ్ళి అతన్ని నిలవేసి 'ఇదిగో స్త్రీ స్వాతంత్ర్యం! మీ స్నేహితు లంతా కలిసి ఇచ్చారు. అంటే ఏమిటో తెలుసా? వెనకనుంచి జడ లాగడం

కాదు. ముందుండి మూతిపళ్ళు రాలగొట్టడం !' అంటూనే ఆమె లలితతో కలిసి వెళ్ళిపోయింది.

కాని దూరాన ముందుపోతున్న కుర్రాళ్ళు హడలు పుట్టి పారిపోయారు.

అయిదు వేళ్లూ అంటి ఎర్రగా కందిన రెండుచెంపల్నీ బాధతో తడుముకుంటూ గుడ్డవెంబడి నీళ్లతో దీపం వెలుగున నిలబడి ఉన్న రామారావు శరీరాన్ని వెనకాల సహోద్యోగులతో వస్తున్న ప్రిన్సిపాలు చూచి కూడా తల వంచుకుని చూడనట్టే వెళ్లిపోయాడు.

భారతి - విరోధి - కార్తికము.



# పరధ్యానం

చొక్కా గుండీ లైనా పెట్టుకోకుండా హడావిడి పడి ఎల్లాగైతేనేం అరగంట ఆలస్యంగా ఆఫీసుకు చేరుకోగలిగాడు కృష్ణమూర్తి.

కాని జేబులో తాళంచెవు లేవీ?

అయిన ఆలస్యం ఎల్లాగూ అయింది. పోనీ ఇంటికి పోయి వద్దామా అంటే, ఈ మధ్య తనంటే బొత్తిగా గిట్టక మండిపడుతున్న పెద్దగుమాస్తాతో వేగడం సాధ్యమైన పని కాదు.

అదృష్టవశాత్తు పక్కగుమాస్తా తాళంచెవి తన అల్మారాకు సరిపోయింది. 'బ్రతికిపోయాం రా! భగవంతుడా' అనుకుంటూ తలుపు తెరిచి పనికి ఉపక్రమిద్దామని కుర్చీలో కూర్చున్నాడు.

ఇంతలో పెద్ద గుమాస్తాగారు పిలుస్తున్నా రంటూ జవాను రానే వచ్చాడు.

'నిన్న పంపించిన కాగితాలమీద నోట్ పుటప్ చేశావా?'

'చిత్తం చిత్తం! ఇదిగో పట్టుకొస్తున్నాను.'

షెల్ఫు లన్నీ వెతికినా ఆ కాగితాలు కనబడిచావవేం?

కొరడాదెబ్బలా హెడ్ క్లార్కు బల్లమీద గంట మోగుతూనే ఉన్నది

'వస్తున్నానండి, వస్తున్నానండి' అని యెన్నిసార్లు మొత్తుకున్నా ఆయన తొందర ఆయనదే!

కొంప మునిగింది! ఇంకేముంది? నిన్న ఇంటికి తీసుకు పోయిన కాగితాల్లో ఇవికూడా ఉన్నాయేమో! వంటినిండా జెర్రులూ, తేళ్లూ పాకి నట్లయి కంగారు పడిపోతున్నాడు పాపం!

9319

సమయం దొరికింది కదా అని నలుగురిమధ్యా నిల బెట్టి పెద్దగుమాస్తా నానాచివాట్లూ పెడుతూ ఉంటే, అతనియందు సానుభూతిగల మిగిలిన గుమాస్తా లందరూ బిక్కమొగా లేసుకు చూస్తున్నారు. కొందరికి ఆయన్ని పట్టుకుని నమిలి మింగేద్దా మన్నంత కోపంకూడా వచ్చింది. అయినా ఏం చెయ్యడానికీ ధైర్యంలేక అల్లాగే చతికిలబడి పోయారు.

అంతసేపు హంగామా చేసి, అన్ని చీవాట్లు పెట్టినా, కసిదీరక క్రౌర్యంతో కదను తొక్కుతూ, 'ఇవ్వాళ ఆ కాగితాలు కనబడక పోవాలి! చూడు ఏం చేస్తానో' అంటూ పెద్దగుమాస్తా అల్లా వెళ్ళాడు.

'ఏం కాగితాలోయ్' అంటూ నారాయణరావు వచ్చి పాడ్ కుళ్లగించి చూస్తే ఆ కాగితాలు అక్కడే ఉన్నాయ్.

దాంతో కృష్ణమూర్తి గుండె కాస్త కుదుట బడింది

నిజానికి అతను చాలా సజావైన మనిషి. అయితే ఏం? అతనికున్న ఉద్రేకం ఆ గుమాస్తా ఉద్యోగానికి పనికి రాదు. వెనక నాలుగు అయిదు పర్యాయాలు పెద్దగుమాస్తా తప్పు రిమార్కులు వ్రాస్తే అందరి మాదిరీ ఊరుకోక వాటిని సరిదిద్ది కలెక్టరుముందు సమర్థించుకోవడమే ఆయన కితని మీాద ఇంతకోపం ఉండడానికి కారణం. ఆ కలెక్టరు ట్రాన్స్ ఫర్ అయిపోవడంతో ఈయనకు పట్టపగ్గాలు లేకపోయాయి.

కాగితాలు కనపడ్డా పెద్దగుమాస్తా ఝూడింపుమాత్రం వదలలేదు. ఈ నోట్‌లో ఈ పాయింటు ఎందుకు వదిలి పెట్టా వనీ, ఇక్కడ ఇదిగూడా ఎందుకు వ్రాశావనీ సాధిస్తూనే ఉన్నాడు. ఆయన ఎన్ని వాగినా ఆ నాడు కృష్ణమూర్తి మాత్రం సమాధానం చెప్పలేదు. పైగా ఇంటిదగ్గర మరిచి పోయిన కాగితాల ప్రస్తావన వస్తుందేమో అని బిక్కుబిక్కు మంటూనే ఎన్ని అక్షతలైనా అల్లా వేయించుకుంటూనే ఉన్నాడు.

మనిషన్న తర్వాత ఎంతవాడికైనా ఎప్పుడో ఒక ప్పుడు, ఎందులోనో ఒకందులో పొరపాటు పడుతూ ఉండడం సహజమే! మంచి ఉద్వేగం గల మనిషి ఒక్కమాటు పొరపాటు పడ్డాడంటే మనస్సుకు ఆ వేగం శాంతించే వరకూ అల్లా పొరపాట్లు వస్తూనే ఉంటాయి.

ఆ నాడు కృష్ణమూర్తి పనికూడా అంతే అయింది. చేతావాతాగాని వంటపని పూర్తిచేసుకుని ఆదరబాదరగా

ఆఫీసులో పడితే తాళంచెవులు ఇంటిదగ్గరే మరచిపోవడం తటస్థించింది. ఆ కంగారులో వెతికితే అవసరమైన కాగితాలే కనిపించలేదు. చివరికి కనిపించినా వెనకటి కసి తీర్చుకోవడానికి ప్రయత్నిస్తున్న పెద్దగుమాస్తా చీవాట్లవల్ల ఉన్నకాస్త మతీ పోయినట్లయి ఆ నాడు అతను చేసిన ప్రతిపనీ తప్పే అయింది. ఒకదానిమీద వ్రాయవలసింది మరొక దానిమీద వ్రాయడం, అయినదానికి కాదనీ కానిదానికి అవునని వ్రాయడం, ఇల్లాగే ప్రతిదీ పొరపాటుగానే జరిగింది. ఒకసారి దారి తప్పిన తర్వాత మళ్ళీ క్రమగతిలో పడాలంటే వెనక్కి మళ్ళాలిసిందే! చిత్తస్వాస్థ్యం కోసం సాయంత్రం ఎల్లా అవుతుందిరా అని ఆ నాడు కృష్ణమూర్తి పడ్డ బాధ ఇంతా అంతా కాదు.

అటువంటి పరిస్థితిలో పోస్టువేళ అయింది. ఆ వేళా ఆఫీసు మూసేవేళా ఒకటే అయింది కాని, కాకుంటే ఆ నాడతని శాఖకు వచ్చిన పెద్దకట్టను అప్పుడే విప్పవలసివస్తే నిజంగా అతనికి పిచ్చి ఎక్కిపోయేది. అందులో మర్నాడు ఆదివారంగూడా అవడంవల్ల దానితో అంత అవసరంలేక ఆ కట్టకట్టా అట్లాగే షెల్ఫులోకి తోసేశాడు.

ఇంతలో జవాను స్వంత ఉత్తరాలు రెండు పట్టుకొచ్చి ఇచ్చాడు. అందులో ఒకటి కార్డూ, రెండోది కవరూ!

కార్డువంక చూస్తూ ఉండగానే అతని పై ప్రాణం పైనే ఎగిరి పోయింది. మూడు రోజుల క్రితంవరకూ నిత్యే

పంలా తిని తిరుగుతున్న తన మేనమామ అకస్మాత్తుగా గురువారం రాత్రి గుండె ఆగిపోయి చనిపోయాడట ! అసలే అంతంతగా ఉన్న అతని మనస్థితికి ఈ దారుణవార్త మరింత వైకల్యం కలిగించిం దంటే ఆశ్చర్యం ఏముంది ?

అంత ఛిన్నాభిన్నమైన మనస్సుతో కృష్ణమూర్తి కవరు విప్పాడు. మొదటివాక్యం సగం చదువుకుని తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. 'నాకు హోటలు తిండి పడదు, వండుకోలేక చస్తున్నాను. మరదలిని వెంట ఇచ్చి చిరంజీవి సౌభాగ్యవతిని పంపవలసిం' దని కోరుతూ తా నెంత ప్రాధేయపడ్డా మూడురోజుల క్రితమేగా 'అమ్మాయి ఇంకా బలహీనంగా ఉన్నది. మాడో నెల వచ్చాక పంపుతా' మంటూ మామగారు వ్రాసింది ? ఇప్పు డిదేమిటి ? 'శుక్రవారం మెయిలులో బయలు దేరి...శనివారం సాయంత్రం... రాజమండ్రీ వస్తున్నాము !' అరే ఇవ్వాళ శనివారమే నే ! అదిగో మెయిలు టైముగూడా అయిపోయింది.

ఇక కృష్ణమూర్తి ఒక్కనిమిషంగూడా ఆఫీసులో కూర్చోలేక పోయాడు. అదృష్టవశాత్తూ పెద్దగుమాస్తా ఆ నాడు అందరికంటే ముందే వెళ్లిపోయాడు. చకచకా బల్ల మీద కాగితాలన్నీ చిందరవందరగా షెల్ఫుల్లో కుక్కేసి సరాసరి స్టేషనుకు బయలుదేరాడు.

ఈ దరిద్రపుగొట్టు ఉద్యోగంవల్ల భూమిమీద పడి నెలరోజు లైపోయినా ఇంతవరకూ తన ప్రథమసంతానాన్ని

చూచుకునే అదృష్టం అతనికి కలగలేదు. కాషువల్ లీవులు అంతకుముందే అయిపోయాయి. అధికారులతో తనకున్న వైరుధ్యంవల్ల ప్రివిలేజి లీవులు మంజూరు కాలేదు. కాక పోయినా సరే సెలవు పెట్టాలంటే, వచ్చే నలభై రాళ్లలోనూ కోత ఒకటి వస్తుంది. అది భరించే తాహతు లేక నోరు మూసుకు పడిఉన్నాడు. అంతకంటే ఏం చెయ్యగలడు పాపం?

తల్లీ, బిడ్డా వస్తున్నారంటే అతని ఆతురతకు అంతు లేకపోయింది. నెలలో చివరిరోజులు. చేతిలో ఒక్కరూపాయి కూడా లేదు. ఎందుకైనా మంచిదని నారాయణరావు నడి గితే అతను కొద్దోగొప్పో వెనక ఉన్నవాడు కాబట్టి అడ గడంతోటే ఒక ఇరవై రూపాయిలు ఇవ్వగలిగాడు. పొద్దుటి నుంచీ సాయంకాలం వరకూ గడచిన అంధకారమయమైన అతని మానసిక జీవితంలో ఈ ఉత్తరం రావడమూ, సమ యానికి సహాయం లభించడమూ వెన్నెలలా పనిచేసి కొంత ఉల్లాసం కలిగించాయి.

మెయిలు గోదావరి స్టేషనులో ఆట్టే సే పాగదు. రాజమండ్రి స్టేషనులో అయితే పెట్టేబేడా దింపుకోవడానికి వీలుంటుంది. అంతదూరం నడిచిపోతే ఆలస్యం అవుతుం దేమో! అందులో సరిగ్గా వారంరోజుల క్రితమే ఇంటివారి పోరుపడలేక ఇల్లు మారవలసి వచ్చింది. పదిరోజుల కింద తాను వ్రాసిన ఉత్తరానికి మామగారు జవాబు వ్రాశాక

తాను తిరిగి సమాధానం వ్రాయడం పడనేలేదు. సమయా నికి రాజమండ్రి స్టేషనులో ఉండకపోతే మామూలు ప్రకారం గోదావరికే వెళ్ళిపోవచ్చు. పోనీ, అక్కడికి వెళ్ళి తేనో! అదీ ఇంచు మించు ఇంతదూరమూ ఉన్నది ఏమో షమవుతుందో! తాను వెళ్లేసరికి రైలు వెళ్లిపోయి మామూలు ఇల్లే అనుకుని ఈ చీకట్లో, ఇంత నడి శీతాకాలం లో తల్లీ, బిడ్డా ఎంత ఇబ్బంది పడతారో గదా!

ఛా! ఎంత సేపటికీ ఆలోచన తెమల దేం? కృష్ణ మూర్తి జట్కాలో ఎక్కాడన్న మాటేగాని మనస్సు మాత్రం రాజమండ్రి గోదావరి స్టేషన్లలో పర్యాయక్రమేణా భార్యాపుత్రుల నన్వేషిస్తోంది.

బండి వచ్చి స్టేషను ముందు ఆగింది, తొంగి చూస్తే ప్లాటు ఫారం మీద రైలు కనపడ లేదు. జనం ఉన్నారు గాని మెయిలు నిరీక్షణాకైన తహతహ కనిపించడం లేదు. వెళ్లి పోయిందేమో అన్న ఆతురతతో బండివాడి కైనా డబ్బు లివ్వకుండా గుప్పున గంతు వేసి కృష్ణమూర్తి ప్లాటు ఫారం మీద పడ్డాడు.

అమ్మయ్యా! మెయిలు రెండు గంటలు ఆలస్యమట! పోర్టరు ధర్మమా అని చల్లని వార్త చెప్పాడు. అప్పటికి కృష్ణమూర్తి తహ తహ శాస్త అణిగింది. వెంబడి వచ్చిన బండి వాణ్ని పంపించి, పెళ్లాంబిడ్డల రాక కోసం నిమిషాలు లెక్కపెడుతూ చికాకుతో పచార్లు చెయ్యడం మొదలుపెట్టాడు.

కడచింది అరగంటే అయినా ఒక మహాయుగం ఎదురు చూచిన ట్లనిపించింది. ఉండబట్టలేక పదేపదే స్టేషను మాష్టరు గది దగ్గరకు వెళ్లి వారినీ వీరినీ ఎంత లేటని అడుగుతూనే ఉన్నాడు. ఈ స్టేషను వాళ్ల కిదో రోగం. ఒక్కరూ సరిగా చెప్పరు. బోర్డు మీద గంటా ఇరవై నిమిషాలు వేసి ఉన్నది. అసిస్టెంటు రెండు గంట లన్నాడు. టిక్కెట్లు ఇచ్చే ఆయన మూడు అన్నాడు. చెకింగ్ ఇన్స్పెక్టరు నాలుగు సార్లడిగినా తన్నుకాదన్నట్లు తల వంచుకు పోయాడు.

గంట అయింది, గంటన్నర అయింది. ఇంకా మెయిలు రాలేదు. కృష్ణమూర్తి చిరాకు మాత్రం నిమిష నిమిషానికీ అధిక మవుతోంది.

'సామర్లకోట దాటిందట' అని జనంలో పుకారు! ఈ మాట విని అప్పుడే రైలు వచ్చేసిందన్నంత ఆతురతతో ఏ మాత్రమూ ఆలస్యం కాకుండా పెళ్లాంబిడ్డలను కనుక్కోవడానికి వీలుగా రైలు రాబోయే వంకే చూస్తూ నిలబడ్డాడు కృష్ణమూర్తి.

'ఆ! ఆ! ఎంతపని జరిగింది!'

'ఘోరం! ఘోరం! రెండు పెట్టెలు తుక్కు తుక్కు అయిపోయాయట!'

'నూట ఏభై మంది ముక్కూ మొహామూ తెలియకుండా చనిపోయారటయ్యా!'

'అనపర్తి మలుపులో గూడ్సు బండితో మెయిలు డీకొన్నదట!'

కృష్ణమూర్తి గుండె ఆగిపోయినంతయింది. ఒకటి రెండు నిమిషాలు అతనిలో చైతన్యమే నశించినట్లయింది. మొహాన కత్తితో వేసినా నెత్తురు చుక్క కనిపించనంతగా నిశ్చేష్టుడై పోయాడు.

జనమంతా ఎక్కడి వాళ్లక్కడ చెల్లాచెదరై పోతున్నారు. కొందరు గుండెలు దడదడలాడుతూ స్టేషను మాష్టరు గది చుట్టవేసి అత్యాతురతతో సమాచారం కోసం నిరీక్షిస్తున్నారు. ఎవరిముఖం చూచినా భయభ్రాంతులు తప్ప మరొక భావం గోచరించడం లేదు. స్టేషనులో ఉండవలసిన తమ వాళ్లే ఏమయిపోయారో అని హడావిడి పడి కొందరు అటూ ఇటూ తిరుగుతున్నారు.

వారి తోపుడు వల్లా వీరి తోపుడు వల్లా కొంచెం సేపు కొయ్య మొద్దులాగానే అటూ ఇటూ ఊగాడిన కృష్ణమూర్తి మరు నిమిషంలో కాళ్ల కింద నిప్పులు పోసినట్లయి ఉన్న చోట ఉండకుండా సంచలించి పోయాడు.

తరిమి తరిమి ఆ ఊహే అతని మనస్సులోకి వస్తోంది. ఎంత ధైర్యం తెచ్చుకుందా మనుకున్నా లాభంలేక పోతోంది. ప్రథమ సంతానం మోహమైనా చూచుకునే యోగ్యత తనకు లేదేమో! పెట్టి పుట్టని అదృష్టం రమ్మంటే మాత్రం ఎట్లా వస్తుంది? ఏమో! భగవంతుడు తన మీద

ఇంత నిర్దయ చూపడేమో! ఎల్లాగైనా అనపర్తి వెళ్లి పడితే తన అదృష్టం బాగుంటే తనవాళ్లు సురక్షితంగా ఉండ కూడదూ! కర్మం చాలక గాయాలు తగిలినా... ...అబ్బ! మళ్లీ అదే ఊహ!

ఎల్లా వెళ్లాడో వెళ్లాడు. కృష్ణమూర్తి కారులో కూర్చున్నాడు. కూర్చున్నాడా? ఆ స్థితిలో మని షేమిటి? కూర్చోవడ మేమిటి? అతని గుండెల్లో రైళ్లు పరుగెత్తు తున్నాయి. సర్వ దిశలా భూమ్యాకాశాలు గిర్రున తిరిగి పోతున్నాయి. అరగంట క్రింద బయలుదేర వలసిన కారు కాబట్టి సరిపోయిందిగాని మామూలు ప్రకారం అతను వచ్చాకే ఆ ఆలస్య మయి ఉంటే అసాధ్యమైనా రెక్కలు కట్టుకుని ఎగరాలని ప్రయత్నించే వా డేమో కాని అందులో మాత్రం ఒక్క నిమిషం ఉండగలిగే వాడు కాడు.

నాలుగు మైళ్ళల్లో అనపర్తి వస్తోం దనగా ఏ వార్త వినవలసి వస్తుందో అని అతని గుండె మరింత తీవ్రంగా దడ దడ లాడింది.

అనపర్తి రానే వచ్చింది. అదిగో! అదిగో! అక్కడే కాబోలు ప్రమాదం జరిగింది. బస్సు ఆపివేసి ప్రయాణీ కులూ, బస్సువాళ్ళూ కూడా ఆ ప్రదేశం చేరుకున్నారు.

అబ్బ! ఎంత దారుణం! ఇటువంటి రైలు ప్రమాదం ప్రపంచంలో మరెక్కడా జరిగి ఉండదు. పది గంటల వేళ ఆ చీకట్లో ఆ ప్రదేశమంతా రక్తమయమై లస లస లాడి పోతోంది. తలలు చితికి, కాళ్ళు ముక్కలయి, పొట్టలు పగిలి

నానా విధ వికృతాకారాలతో మరణించిన అభాగ్యుల శవాలు అడిగేవారు లేక కొన్నీ, ఆనవాలు తెలియక మరి కొన్నీ పోలీసుల రక్షణలో పడి ఉన్నాయి. గుర్తు పట్టిన శవాలమీద పడి అయినవారు చేస్తున్న ఆక్రందనలు మిన్ను ముట్టి పోతున్నాయి. క్రేనులు పనిచేసి కూలిపోయిన పెట్టెలను లేవనెత్తుతుంటే కేవలం రక్త మాంస పిండాలు కొన్ని బయట పడుతున్నాయి. తల్లులను కోల్పోయిన అనాథ శిశువులూ, కన్న సంతానం అదృశ్యం కాగా అవురావు రని ఏడ్చే తల్లిదండ్రులూ, తమ బిడ్డలకు ఏ అపాయం వస్తుందో అని రెండు చేతులతో గుండె కానించుకునే మరణించిన మరభృష్ట మాతృమూర్తులూ, కంటక శిలావృతమై అంధ కార మయమైన ఆ ప్రదేశాన్ని ద్రవీభూతం చేస్తున్నాయి.

ఆ మహా సంక్షోభంలో కృష్ణమూర్తి అన్వేషణ ప్రయత్నం ఏం ఫలిస్తుంది? పట్టరాని దుఃఖావేశంలో కనబడ్డ ప్రతి వ్యక్తినీ తన వారిని గూర్చి అడిగాడు. కాని అతనికి సమాధానం చెప్పే దెవరు? కళ్ళు చిల్లులు పడేటట్లు ఎంత గాలించినా బ్రతికి ఉన్న వారిలో ఎక్కడా అతని భార్య కనిపించ లేదు. దుఃఖోద్వేగంతో గొంతెత్తి ఎంత అరచినా, అడుగుల సవ్వడికే ఆతురతతో బదులు పలికే ప్రేయసి మధుర వాక్కులు గాని, ఆర్తనాదం కాని అతనికి శ్రవణగోచరం కా లేదు. హతాశుడై, జరిగిన దారుణ సంఘటనకు పరితపిస్తూ, హతులయిన వారి ఆప్తుల మని ఎవ రెన్ని సార్లుఅడిగినా

విసుగుకోని క్వాచిత్కంగా ఉన్న అధికారుల ఔదార్యం వల్ల, మృత స్త్రీ కళేబరాల వద్దకు పోయి ఎంత పరీక్షించినా అతని భార్య జాడ కానరాలేదు. పోలీసుల అధీనంలో ఉన్న మాతాపితృవిహీన శిశుసమూహంలో తన బిడ్డ ఉందేమో గుర్తు పట్టడానికైనా అతనికి యోగ్యత లేక పోయింది.

తెల్లవారింది. కాంచనం కోసం కల్లబొల్లి యేడ్పులు ఏడ్చిన దొంగ చుట్టాలు అదృశ్యమయి పోగా నిజమైన బంధువులు తమవారి శవాలకు అంత్యక్రియలు చెయ్యడంలో నిమగ్నులై పోయారు. మానవత్వం నశించని చూపరులకు మాత్రం చీకటితెర తొలగడంవల్ల ఆ సంఘటన దారుణత్వం మరింత గాఢంగా హృదయాలను కలచి వేసింది.

పగలు పన్నెండయినా కృష్ణమూర్తి అన్వేషణ ఫలించలేదు. అతని మనస్సులో ఏ ఆలోచనకూ తావే లేకుండా పోయింది. ఆ స్థితిలో ఉన్న అతన్ని ఓదార్చేందుకైనా అయినవాడు ఒక్కడూ లేకపోవడం వల్ల అతని దుఃఖం అవధులు దాటి పోయింది. అందు వల్లనే కొంత సేపటికి దానంతటదే అణగి పోయింది కూడా!

కృష్ణమూర్తి భార్యా పుత్రులను కోల్పోయినంత మాత్రాన ప్రపంచగమనం ఎందు కాగుతుంది? ఎవరున్నా, లేకపోయినా జగన్నాథ రథం సాగుతూనే ఉండేటట్లు అన్నీ యథా ప్రకారం జరిగి పోతూనే ఉన్నాయి.

అక్కడ నుంచి విశాఖపట్నానికి రైలు సిద్ధమైన దనడంతో స్తబ్ధమయిన కృష్ణమూర్తి మనస్సుకు చైతన్యం

కలిగింది. 'ఏం చెయ్యాలి?' అన్న ప్రశ్న అతని కప్పటికి తట్టింది. విశాఖపట్టణం! అత్తమామలు! అణగిపోయిన అతని దుఃఖం మళ్ళీ అతిశయించింది.

కదలబోతుండగా ఎల్లాగైతేనేం కృష్ణమూర్తి రైల్లో పడ్డాడు.

విశాఖపట్టణం స్టేషనులో దిగీ దిగడంతోటే రామారావుగారు కనిపించారు.

'ఏమోయి కృష్ణమూర్తీ! అంతా కులాసా!'

ఈ ప్రశ్నకు అతనేం సమాధానం చెప్పగలడు? జరిగిన సంగతంతా తెలుసుకుని ఆయనగూడా విచారించాడు. ఎవ రెంత విచారిస్తే మాత్రం అతని బాధకు ఉపశమనం ఎట్లా కలుగుతుంది?

మాటి మాటికీ తన పుండు తానే కెలుక్కో లేక కృష్ణమూర్తి తల వంచుకుని దారిని బడ్డాడు.

తీరా మామగారి ఇంటి దగ్గరకు పోగానే ఆ ఇల్లు తాళం వేసి ఉన్నది. ఇరుగు పొరుగు వాళ్ళను వాకబుచేస్తే ఇద్దరు పిల్లల్నీ వెంట బెట్టుకుని అమ్మాయి వెంట ఆవిడ గూడా వెళ్ళిందని తెలిసింది. రామరామ! ఆ వల్లకాటిలో వీళ్ళను గూడా తాను గుర్తు పట్టలేక పోయాడేమో! ఇదంతా ఏ జన్మలోనో తాను చేసుకున్న మహా పాపానికి ఫలితం. హతవిధీ! హతవిధి!

అయితే మామగారేమైనట్లు? ఆ చుట్టు పక్కల ఇళ్ళవాళ్ళని ఎంత మంది నడిగినా ఆయన సంగతి తేలలేదు.

చివరకు ఆయన ఆఫీసులోనే పనిచేస్తున్న నరహరిరావు నడిగితే పది రోజులు సెలవుపెట్టి ఏ ఊరో వెళ్ళారని మాత్రం తెలిసింది.

ఆయన వచ్చేదాకా అక్కడ పడి ఉండి తానేం చెయ్యాలి? ఉన్నచోటికి వెళ్ళి వద్దామా అంటే, ఊరు కూడా తెలియలేదాయె! సర్వనాశనమయి ఈ దుఃఖం తాననుభవించడానికి తోడు ఇతరులకు కూడా ఈ వార్త తెలుపవలసిన బాధ్యత తన మీదే పడిందే! ఒక వేళ ఆయనకు కూడా ఎల్లాగో ఈ రైలు ప్రమాదం సంగతి తెలిసి ఏ బస్సు మీదనైనా అనపర్తి వెళ్ళారేమో! ఆయన రాక ముందే తాను ఇటు వచ్చి ఉండవచ్చు.

కృష్ణమూర్తి మళ్ళీ అనపర్తి వచ్చాడు. అతనికి వట్టి వెర్రి గాని ఆయన వచ్చి ఉంటే మాత్రం అక్కడే కూర్చుని ఉండబోయాడా? అనపర్తి వెళ్ళడం వల్ల ఆయనైతే కనిపించలేదుగాని, ప్రమాదం జరిగిన చోటు, గుర్తు పట్టడానికి వీల్లేనంతగా ఇతర ప్రదేశంలో కలిసిపోయినా, తద్దర్శనం మాత్రం అతనికి వెనకటి భయంకర దృశ్యాలను స్మృతిపథంలో గోచరింప జేసింది. దాంతో తాను సరిగ్గా అన్వేషించలేదేమో అన్న అనుమానం కూడా తట్టింది. బ్రతికిఉండగా చూచుకోలేకపోగా కళేబరాలనైనా కళ్ళజూచే అదృష్టం తనకు లేక పోయింది. సర్వ ప్రాణికోటికీ మరణం తప్పనిసరి అయినా అంత్య సంస్కార సమయంలో కూడా ఆపేక్షతో కన్నీరు విడిచేవారు లేని ఇటువంటి స్థితిలో మరణం మాత్రం తనకు కాదుగదా జన్మ జన్మాలకూ మరెవ్వరికీ రాగూడదు!

ఇటువంటి ఊహాలు పొర్లు కొస్తున్న మనస్సుతో అనపర్తి నుండి కృష్ణమూర్తి రాజమండ్రి వచ్చాడు.

తీసుకు వెళ్ళిన పైకమంతా ఖర్చయిపోయి, ఓపిక లేక బండీ ఎక్కుదామన్నా చేతిలో దమ్మిడీ లేక, నిర్జీవ ప్రతిమ వలె సోమవారం ఉదయం పదకొండుగంటల వేళ చిరాకు నధికం చేసే ఆ చిడిమిడి ఎండలో మెయినురోడ్డు వెంట కృష్ణమూర్తి నడుస్తున్నాడు. అమ్మయ్యా! ఇంకొక్క మలుపు తిరిగితే ఇల్లు వస్తుంది. కాసేపు నడుం వాలిస్తే తప్ప అత నింక బ్రతకలేడు. ఇంతవరకూ అత నెట్లా బ్రతికి ఉండ గలిగాడో అతనికే ఆశ్చర్యంగా ఉంది. ఇంతటి విషాద సన్నివేశంలోనూ దురదృష్టవశాత్తూ ఆత్మహత్యాభావమే అతనికి గోచరించలేదు కాని నిజంగా తోచి ఉంటే ఈ పాటికి ఏ పరలోకంలోనో తన ప్రియమైన భార్యనూ, తన రక్త మాంసాలతో మూర్తీభవించిన ప్రియతనూజుణ్ణి మన సారా ముద్దాడి తత్పరిష్వంగ తన్మయత్వంలో స్వర్గసుఖమే పొందగలిగే వాడు! ఛీ! ఛీ! తన నైచ్యం ఎంత వరకూ వచ్చింది? ఇంత దారుణ వార్త విన్నప్పటికీ తన మనస్సు ఆమూలాగ్రంగా సంక్షోభించి దుఃఖించిందే కాని, ఇహ లోకంలో తన్ను సుఖపెట్టడం కోసం సర్వస్వం త్యజించిన ప్రేయసిని కలుసుకోవడానికి తాను వెళ్ళడం తన ధర్మమని అణుమాత్ర మైనా తలపోయలేదేం? ఇదేనా తన కృతజ్ఞత? ఇప్పటి కైనా మించిపోయింది లేదు. కృష్ణమూర్తి ఇక లేడని లోకం నిస్సందేహంగా నిశ్చయించుకోవచ్చు!

అదేనా అతని ఇల్లు?

ఆ ఇల్లు అల్లా తాళం తెరిచి ఉన్నదేం? వెళ్లేటప్పుడు తాను మరిచిపోలేదు గదా! ఎల్లాగూ చనిపోదలుచుకున్న తనకు ఏం పోయినా ఇబ్బంది లేదు గాని ఆ నారాయణరావు పైకం ఇచ్చివెయ్యడానికి మాత్రం ఏదో ఒక వెండి వస్తువైనా మిగిల్చి ఉంటే బాగుండును! అంత కంటే తాను వాంఛించేది మరొకటి లేదు. తనకు పెద్ద ఆస్తిపాస్తులు ఉన్నవీ లేవు, ఉన్నవి ఏమైనప్పటికీ వీసమెత్తైనా బెంగా లేదు!

ఎవరో తిరుగుతున్నట్లున్నారే! అదేమి టది రాజ్యమేనా? అదిగో అత్తగారే! పాపం మనమడితో కుమార్తె గతించగా తన్ను మాత్రం భగవంతుడు మిగిల్చాడని విచారంతో బాధ పడుతోంది కాబోలు!

ఆఁ! ఆఁ!

అదే మి టది నిజమేనా?

తా నున్నది పరలోకం కాదు గదా!

'లచ్చూ! లచ్చూ!'

ఎంత బిగ్గరగా అరచినా అతని గొంతు అతనికే విన బడ లేదు. లచ్చు మాత్రం నిజంగానే వచ్చి వాకిట్లో నుంచుంది. కృష్ణమూర్తి తన కళ్లను తాను నమ్మలేక పోతున్నాడు. అదిగో అత్తగారు! అదిగో రాజ్యం! అదిగో మోహానుడు! అంతా తన వంకే ఆశ్చర్యంతో చూస్తున్నారు. బావ వచ్చాడు, బావ వచ్చాడు అంటూ వాళ్లిద్దరూ నిజంగానే కేక వేశారు. అందరూ సంతోషంగానే ఉన్నారే!

కృష్ణమూర్తి అడుగు ముందరికి పడడం లేదు. అదిగో పిల్లవాడి కేక !

ఒక్క గంతులో కృష్ణమూర్తి ఇంట్లోకి చేరి పోయాడు. అబ్బాయిని మనసారా కళ్లారా తనివితీరా చూచి గాఢంగా గుండె కదుముకున్నాడు. ఇంత గాఢత తెలియని ఆ పసికందు కెవ్వు మని కేక పెట్టింది. లచ్చూ, ఆమె తల్లీ భయభ్రాంతులై ఇతని వాలక మేమిటో తెలియక తికమక పడిపోతు న్నారు. దగ్గరకు వచ్చి చెయ్యి జాపిన భార్యకు కుమారుణ్ని అందిస్తూ ఆమె వంక కృష్ణమూర్తి అనిమేషంగా చూచాడు.

*          *          *

'శుక్రవారం మెయిలులో బయలుదేరి సామర్లకోట లో దిగి కాకినాడ వెళ్లి అక్కయ్యను చూచి మర్నాడు సాయంత్రం అంటే - శనివారం సాయంత్రం బస్సులో రాజమండ్రి వస్తున్నాము.'

ఆ నాడు వచ్చిన ఉత్తరంలో ఉన్న విషయం ఇది. ఇంత స్పష్టంగా ఉన్నదాన్ని ఆ నా డెందుకు అర్థం చేసుకోలేక పోయాడో కృష్ణమూర్తి కిప్పటికీ ఆశ్చర్యంగానే ఉంటుంది.

తలుచుకున్నప్పుడల్లా తాను పడ్డ వేదనతో పాటు అనపర్తి దృశ్యాలు కళ్లకు కట్టి నిశ్చేష్టు డవుతూ ఉంటాడు.

